లేని గాథల సూత్రింవ బూనలేదు -
కపట కవిసంఘ కల్పితాక్రిమ పురాణ
వర్గ సత్యవృత్తాంతమున్ బ్రకటనమ్ము
జేయ వ్రిమదాన నుద్యమించితిని గాని—



*

# స మ ర్ప ణ ము

జననీ జనకులు

అన్నపూర్ణాదేవి నాయుడమ్మ

చౌదరిగార్ల

పాదపద్మముల సన్నిధిని

# నిహిలిజం

గోపీచంద్, బి. ఏ. బి. యెల్.

1917 రష్యా విప్లవానికి ముందుమాట.....అప్పుడు రష్యాలో 'నిహిలిజం' అనే వుద్యమం వుండేది. రష్యా విప్లవానికి దారిని ఏర్పరచిన ఉద్యమం అది. క్రొత్త సంఘాన్ని సృష్టించడానికిగాను ప్రాత వుద్దేశాలను రూపుమాపింది ఈవుద్యమం. యం. యన్. రాయ్ చెప్పినట్లు, "సంఘంలో మార్పు తీసుకొనిరావడానికి ముందు, మానవుని భావాలలో మార్పు తీసుకొనిరావాలి."

ప్రథమంలో ఈ వుద్యమదారులు కేవలం తత్వవేత్తలుగా వుండి, తమ వుద్దేశాలను గ్రంథాలలో వెలువరించి తృప్తిపడి వూరుకునేవారు. ఒకనూతనోద్దేశాన్ని ప్రజలలో పడవేస్తే, దూదిలో పడవేసిన నిప్పుకణంవలే, తనపనిని తాను నెరవేర్చు కుంటుందని వీరి ఉద్దేశం. ఆరోజుల్లో వీరి నాయకులు జెర్నీషెవి స్కీ, మిఖెలోవ్, లారావ్ మొదలయినవారు.

పూర్వాచారములను ఖండించడం, పూర్వ సిద్ధాంతములను విమ ర్శించడం, పూర్వ చరిత్రలను శంకించడం వీరిపని. ఈ వుద్యమా నికి 'నిహిలిజం' అని పేరు పెట్టింది రష్యన్ కథకుడైన టర్గనీవ్.

అతడు ఈ నిహిలిజాన్ని గురించి 'తండ్రులు తనయులు' అనే గ్రంథం వ్రాశాడు. అందులోని ఈ క్రింది సంభాషణ వింటే, నిహిలిస్టు వుద్యమం అంటే ఏమిటో తేలిగ్గా బోధపడుతుంది.

" నీ స్నేహితుడయిన ఈ బజారోవ్ ఎవ్వరు ? "

అతడు ఆర్కాడీని ప్రశ్నించాడు.

" అత డెవ్వరో నిజంగా చెప్పమంటావా ? "

అని ఆర్కాడీ నవ్వుతూ అడిగాడు.

" నీ ఇష్ట మయితే చెప్పు "

" అతడు నిహిలిష్టు. "

" ఏమిటీ ? "

అని నికోలో పెట్రోవిచ్ కేకవేశాడు. పాల్ పెట్రోవిచ్ స్థంభించి పోయి నోరు తెరచి చూచాడు.

" అతడు నిహిలిస్టు. "

అని మళ్ళీ చెప్పాడు ఆర్కాడీ.

" నిహిలిస్టూ ! బహుశా ఇది 'నిహిల్' అనే లాటిన్ శబ్దంలోనుంచి వచ్చిందనుకుంటాను. 'నిహిల్' అంటే శూన్యం. కనుక నిహిలిస్టు అంటే ప్రపంచంలో దేనినీ ఒప్పుకోని మనిషని అర్థం. "

అన్నాడు నికోలో పెట్రోవిచ్.

" కాదు. ప్రపంచంలో దేనినీ గౌరవించని మనిషని అర్థం. "

అన్నాడు పాల్ పెట్రోవిచ్.

" కాదు ప్రతివిషయం విమర్శక బుద్ధితో చూచేమనిషని అర్థం, "

అన్నాడు ఆర్కాడీ.

" ఏ అధికారానికీ లోబడకపోతేనూ, ఎందులోనూ నమ్మకం లేకపోతేనూ ఏమవుతుంది? "

" అది ఆవ్యక్తి గుణాగుణాలమీద ఆధారపడివుంటుంది. కొందరు బాగు పడతారు. కొందరు చెడిపోతారు. "

" అలాగా! మేము ముసలివాళ్లం, మాపద్ధతే వేరు. కట్టుబాట్లు లేకపోతే ఒక్కడుగు కూడా ముందుకు వెయ్యలేమని మావుద్దేశం........ఏమిటీ? అమాటేమిటీ? "

" ని—హి—లి—స్టు "

అని చెప్పాడు ఆర్కడీ, బిగ్గరగానూ, స్పష్టంగానూ.

" అదీ! పూర్వం హెజిలిస్టులుండేవారు. ఇప్పుడు నిహిలిస్టులు. ఆహా!! కాని ఏమీలేకుండా మీరు ఎల్లా బ్రతుకుతారు? గాలే లేని Vacuumలో మీ రెలా ప్రాణాలు నిలుపుకుంటారు? "

ఇదీ నిహిలిజం—

మనదేశంలో, వాఙ్మయ ప్రపంచంలో, ఈ వుద్యమం వీరేశలింగం పంతులుగారితో ప్రారంభమై, రామస్వామి చౌదరి గారితో చివరిమెట్టుకు వెళ్ళింది.

ఈ గ్రంథం (అధర్మవిజయం) మన దేశంలో అంతరించబోతున్న ఈ వుద్యమం ఛాయ. సీతారామస్వామిగారు నిహిలిస్టులు.

ఈ వుద్యమం రష్యాలో ప్రారంభమైనదని చెప్పాను. ఆలోచిస్తే ఈఅవస్థ ప్రతిదేశానికీ, ప్రతి వ్యక్తికీ ఎప్పుడో ఒక్కసారి తప్పకుండా సంభవిస్తుం దనుకుంటాను.........సంఘం మారుతూవుంటుంది. కొన్ని సంవత్సరాలు మార్పులేకుండా కుళ్లు పేరుకున్నప్పుడు విప్లవం వస్తుంది.........ఈవిప్లవం పూర్వసిద్ధాంతాల మీదికి, పూర్వగ్రంథాలమీదికీ కవుల దండయాత్రతో ప్రారంభ మవుతుంది.

మానవుడు ప్రథమ దశలో ప్రతిదీ నమ్ముతాడు. 'అదీ లేదు. ఇదీ లేదు. ఏదీ లేదు.' అనేది మానవుని రెండోదశ. ఈ రెండోదశ రాబోయే మూడోదశకు పీఠిక వంటిది. ఈ రెండోదశలో వున్న మనిషి నిహిలిస్టు. అతడు ప్రపంచంలోవున్న ప్రతి సంస్థతోనూ అసంతృప్తి పడి విమర్శిస్తాడు.

వీరిది Destructive criticism. వీరు సంఘం ఏమిచెయ్యాలో చెప్పరు. "నీ శరీరంమీద పురుగులున్నాయి. అవి తీసివేసుకో. తీసివేసుకొని ఏమిచెయ్యమంటావు? అని అడగడం పిచ్చి! తీసి వేసుకుంటే చాలు," అంటారు.

ఈ పద్ధతివల్ల దేశమునకూ, భాషకూ వుపయోగం లేదనికాదు నావుద్దేశం. ఈ అవస్థ historic necessity. ఈ అవస్థ చైతన్య చిహ్నం. ఈ అవస్థ అనుభవించనిది మూడో అవస్థను పొంద లేడుమానవుడు. ఈ అవస్థ దాటనిదే, పూర్వసిద్ధాంతములమీది మమకారం పోనిదే Constructive criticism రాదు...... కాని ఈదశను ఎంత త్వరగా దాటితే అంత మంచిది. ఈ దశ Constructive criticism కి తీసుకొని పోయే దారేగాని, కవుల కిది శాశ్వతంగాదు. అందులో ఇప్పటి మన సంఘం ఈ అవస్థను దాటింది.

సీతారామస్వామిగారు ఈ సంగతి మనస్సులో వుంచుకొని భాషాసేవ చేస్తారని తలుస్తాను.

సూతాశ్రమం, తెనాలి.
1—1—1938.

ఇందులోని నాటికలు:

రాజ్యతృష్ణ

బ్రహ్మహత్యాఫలం

వనవాసము

ఆచార్యవధ

జరాసంధవధ

## రాజ్యతృష్ణ

### రంగము — యుద్ధభూమి

[రావణుడు దివ్యమణిరత్నగణప్రభాభాసమానమైన రథం మీద కూర్చుని వుంటాడు. దాని దీధితులు దిశలెల్లా దీటుకొంటూ వుంటాయి. ఎట్ట ఎదుట రాముడు నాకపతి రథం మీద రౌద్రమూర్తియై వుంటాడు. ప్రక్కన విభీషణుడు. యుద్ధరంగం అంతా మహా భయంకరంగా వుంటుంది, కుప్పలు కుప్పలు అయి పడివున్న మృతకళేబరాలతోటి ఒకప్రక్క—వికలాంగులై వింత వింత కేకలు వేస్తూ వున్న వానరులతోటి ఒకప్రక్క—రక్తసిక్తాంగులై వీరస్వర్గము చేరబోతూవున్న రక్షోభటకరాళవక్త్ర నిర్గత ధ్వానాలతో ఒకప్రక్క. రావణునితో యుద్ధం చేసిచేసి, విసిగిపోయాడు రాముడు. విభీషణుని చూస్తూ ఇలా అంటాడు రాముడు అప్పుడు:]

రాముడు

ఏమోయీ! విభీషణా! మీ అన్న మహా దిట్టలాగా వున్నాడే చూస్తే!

విభీషణుడు

కాబట్టే కదూ దేవత లంతా దీనాననులై దాస్యం చేయడం మా అన్నకు.

రాముడు

ఇవ్వాళతో వారి దాస్యం పోగొడతాను. చూస్తూ వుండూ, మీ అన్ననూ—

విభీషణుడు

మీరు పొరపాటు పడ్డారు సుమా! అతన్ని చంపడం మీరు అనుకున్నంతగా సుళువయింది గాదు. పైగా మీరు డస్సిపోయినట్టున్నారు చూస్తే!

రాముడు

అవును. నీవు అన్నట్టు డస్సిపోయాను నేను. అబ్బా! ఏమి లావు! ఏమి వీక! ఏమి పరాక్రమము! అందుకనే లోకవిద్రావణుడయ్యాడు రావణుడు! దేవతల్ని దీనత్వం బొందించి దాస్యం జేయించుకుంటున్నాడు ఇంత విక్రాంతి వున్నది కాబట్టే! మూడు లోకాల్ని ముప్పుతిప్పలు బెట్టాడు ఇంత శౌర్యం వున్నది గాబట్టే!! ఇందుచేతనే తల్లడిల్లి పోయారు మునితల్లజు లందఱూనూ. నా బాణ పరంపరలు ఎలా కుంఠీకరించి పోతున్నాయో చూస్తున్నావుగా! అదిగో! అటుచూడు! మీ అన్న ఎలా ప్రకాశిస్తున్నాడో ద్విగుణీకృతోత్సాహంతోటి......మనం దీప్తి తఱిగిపోతూంటే క్రమక్రమంగానూ. ఇతన్ని వధించడానికి ఇంకో మార్గం ఏమైనా వుంటే...

విభీషణుడు

మీరు అలా నిరుత్సాహపడతా రేమండీ? ఈ దుష్టుణ్ణి దునిమి దురంతసంతాపాలు పొందుతూవున్న ఋషిపుంగవుల్ని రక్షించ

వద్దా మీరు? శత్రువుని సంహరించి, ఈ లంకారాజ్యాన్ని నాకు ఒసగవలసి వున్నారుగా, మీరు పూర్వం జేసిన వాగ్దానం ప్రకారంగా! ముందు ఇన్ని చేయవలసివుంటే అప్పుడే ఇంత అధైర్యపడితే ఎలా?

రాముడు

ప్రతిక్షణమూ మీ అన్న బలం పెంపెక్కుతున్నది. అందుకనే అతని ముఖాన ఆ నూత్నసందీప్తి—ఆ ఉన్మేషమూనూ. అబ్బా! ఇతను ఎలాంటి వరాలు పొందాడోయి! బాణాలు ప్రయోగించి ప్రయోగించి చచ్చుబడి పోయినాయి నా చేతులు రెండూనూ. అస్త్రాల శక్తి అడుగంటింది వీని ముందర. శస్త్రాలు అన్నీ శాంతించినాయి ఇతని సమక్షంలో. ఎన్నిసార్లు నరకినా, తిరిగి మోసు లెత్తుతున్నది ఇతని శిరస్సు. ఏమిటీ! ఈ విచిత్రం! ఏమిటీ! ఈ పరాక్రమసంపద! ఏం విభీషణా! ఇంకో మార్గం ఏమైనా వుంటే ఇతన్ని వధించడానికి—

విభీషణుడు

మీకు తెలియనిది ఏమున్నదండీ! నిఖిలభువన రక్షాదక్షు లైనట్టి వారు.

[తనలో]

ఈ రాముడు నిరుత్సాహు డయ్యాడు నిర్వక్రవిక్రము డైన మా అన్న ముందు. వరప్రసాదగరిమచేత అతీతుడై వున్నాడు రావణుడు. వ్యర్థమై పోతున్నాయి రాముని బాణాలు. ఇక సాధించే మార్గం ఎలా రావణుణ్ణి?......

[ఆలోచించి]

ఆఁ...ఒక వుపాయం స్ఫురిస్తున్నది. నా అన్నను నాభి మీద కొట్టిస్తే రామునితో చెప్పి...అతను తప్పకుండా పాటిస్తాడు... ఇంత కంటే వేరే మార్గం ఏమీ లేదు. బాహాటంగా గొట్టే శక్తి రాముని దగ్గర లేనట్లు పరిస్ఫుట మవుతున్నది. ఈ విషయం రామునితో చెప్పేదా?...

[మళ్లీ చింతించి]

ఛీ! అధర్మం—అధర్మం......నాభి పైన కొట్టించడ మేమిటి?—ధర్మయుద్ధంలో పొసగుతుందా అది? అలా చేయించేటట్లయితే నల్గురూ నవ్విపోరూ నలుపక్కలానూ! అదీగాక, నేను ఇలా చెప్పితే, అంగీకరిస్తాడా రాముడు? నన్ను చీవాట్లు పెట్టకుండా వుంటాడా ఇదా నీవు చెప్పే సలహా అని.

[మళ్లీ ఆలోచించి]

అలా అని వూరుకుంటే ఎట్లా? నాభి మీద కొట్టందే చావడు రావణుడు. అతను చావందే, ఈ అస్తోక సంపదలకు ఆకరం అయిన లంకారాజ్యం నా వశంగాదు. నేను రాజునై తేగాని, విశేష ఔన్నత్యమూ, విస్తారసౌఖ్యమూ పొందడానికి వీలుండదు.

అదీగాక, నన్ను పరాభవించాడుగా రావణుడు! ఇదివఱకు పెక్కుకష్టాలకు అగ్గం జేశాడుగా నన్ను! దానికి బదులు తీర్చుకోవద్దూ మఱి ఏదో విధంగా, అతన్ని చంపించి రామునిచేత...

తర్వాత లంకాధిపతిని గావద్దూ—విశేష విభూతి అనుభవించ వద్దూ రాజునై—

సరే, ఇక నాభి మీద కొట్టడానికి అంగీకరిస్తాడా రాముడు! అధర్మమంటూ ఆగ్రహిస్తాడేమో! కాదు...కాదు... తప్పకుండా అంగీకరిస్తా డనుకుంటాను చెప్పిన వెంటనే. ఎందుకంటే, రావణున్ని చంపడానికి సాధ్యంగాకుండా వున్నది అతనికి... నాకు లంకారాజ్యం మా అన్నను జంపి ఇస్తానని వాగ్దానం జేశాడు ఇదివఱకే రాముడు. మఱి ఆ వాగ్దానాన్ని నెఱవేర్చుకోవద్దూ ఎలాగయినా మా అన్నను చంపి. లోకవిద్రావణుడయిన రావణున్ని చంపాడని సంతోషించవద్దూ ప్రజలున్నూ, మునులున్నూ? మఱి ఇతన్ని చంపింతర్వాతనే కదూ సీతను అయోధ్యకు పట్టుకెళ్లేది? ఇలా చేయలేకపోతే జనులంతా రాముణ్ణి గురించి ఏమి... ఇలాంటి మహత్తరకార్యాలు చేయవలసి వున్నాడు రాముడు. చూస్తే, మా అన్న లొంగేటట్టు లేదు. ఇట్టి పరిస్థితుల్లో రాముడు నా మాట వినకపోతాడా! చెప్పిచూస్తాను ఇక బొడ్డు మీద కొట్టమని, అందులో అమృతకలశ మున్నదని మిషబెట్టి.

[ప్రకాశముగా]

నాకు ఒక మార్గం స్ఫురించింది మా అన్నను చంపడానికి. అతని పొక్కిలిలో అమృతకలశం వున్నది. అది వున్నంతవఱకూ అజేయుడు అతను. కాబట్టి బొడ్డు మీద ప్రయోగించాలి మీరు బాణాలు. వేరే మార్గం ఏమీ లేదు. అనుమానం వద్దు ఇక మీకు.

రాముడు

[తనలో]

ఏమిటీ ! నాభిలో అమృతకలశమా! అందువల్ల అతడు 'అజేయుడా? అది సంభవమేనా?

నాభి మీద గాని, దాని అధోభాగంలో గాని, ఎక్కడా శస్త్రాస్త్రప్రయోగం జేయ గూడదుగా! అది ధర్మయుద్ధసూత్రం గాదూ? ఇప్పుడు అందుకు భిన్నంగా ప్రవర్తించడం అన్యాయం గాదూ?

[తల పంకించి]

చూస్తూ, చూస్తూ, నన్ను అధర్మమార్గానికి త్రిప్పుతున్నాడే ఈ విభీషణుడు! ధర్మయుద్ధ నిర్ణయాన్ని ఉల్లంఘించ మంటున్నాడే! ప్రజలంతా పరికిస్తున్నప్పటికీ అక్రమవధోద్యోగానికి ముందంజ వేయ మంటున్నాడే! ఇంత నిస్సందేహంగా ఇతడు నన్ను ప్రోత్సహించడానికి కారణం?...ఇతని వుద్దేశ్యం......

[ఊహించి]

ఓహో! ఆ వేళ లంకలోని గుట్టు కనుక్కోవడానికి ఇతన్ని చేరదీసినపుడు ఇతడు లంకారాజ్యాన్ని కోరాడు తన సహాయానికి ప్రతిఫలంగా! నేను కూడా ఆ యాశను పెంచి వాగ్దానం ఇచ్చాను. కాని అప్పటి నుండి నేటి వరకూ ఇతని కోరిక నెరవేర్చలేదు.

ఇంతవరకూ ఏదో విధంగా ఈ యుద్ధాన్ని జయప్రదంగా నిర్వహించాము గాని ఇవ్వాళ్ళ ఏమాత్రమూ ప్రయోజనం

గన్పించడం లేదు. నాకు రావణుడు అతీతుడుగా వున్నాడు. అతని పరాక్రమదీప్తులు ఇనుమడిస్తున్నాయి. నా బలం అంతా సన్నగిల్లి పోతున్నది. అందుచేత ఇంకో మార్గం ఏమైనా వుంటే సూచించ మనగానే ఈ పద్ధతిని అవలంబించ మంటున్నాడు విభీషణుడు.

సక్రమవిధానంతో రావణుని సంహరించడం నా చేత గాదని తేట తెల్లం గావడం చేతనూ, ఏ విధంగా నయినా అతన్ని వధింప జేసి లంకారాజ్యాన్ని తాను అనుభవించాలనే కుతూహలం అగ్గలంగా వుండడం చేతనూ, ఈ విభీషణుడు నన్ను ఇలా ప్రోత్స హిస్తున్నాడు. నాభిలో అమృతమున్నదనే మిషతో—నేను అం గీకరించనేమో అని—అక్కడ శస్త్రప్రయోగం జేయ మంటు న్నాడు.

మఱి ఈ పద్ధతి—ధర్మసూత్రాన్ని త్రోసిరాజని—అవలంబించ డం నాబోటి వీరులకు...

[ఆలోచించి]

ఛీ! నేను దీన్ని గూర్చి ఇంతగా ఆలోచించవలసిన అగత్యం ఏ మున్నది? పట్టపగలు ఇంతమంది దేవతలూ, సైనికులూ, ప్రజలూ ఆతురతతో చూస్తుండగా నేను వక్రమార్గాన్ని అనుసరించేదా? ధర్మసూత్రాన్ని కాల దన్నేదా? అధర్మ విజయాన్ని చే పట్టేదా?

ఒకవేళ నేను విజయాన్నే ప్రధానంగా పరిగణించి, ఇలా చేయ డానికి ఉపక్రమిస్తే, లోకం అంతా నన్ను ఆక్షేపించదూ? మా

ద్వంద్వయుద్ధాన్ని అవలోకిస్తున్న ఈ దేవతలూ, మునులూ, ప్రజలూ నన్ను నిందించరూ? రాముడు రావణుణ్ణి అధర్మంగా చంపాడని ప్రజాసముదయం కలకాలమూ ఆడిపోసుకోరూ? ఈ చర్య నా కీర్తికి తీరని కళంకాన్ని ఆపాదించదూ?

[మళ్ళీ ఆలోచించి]

అబ్బా! ఏమిటీ! ఈ సంధిగ్ధావస్థ! ఏమిటీ! ఈ ఆలోచనా పరంపరలూ!! ఏమీ తోచకుండా వున్నదే?

రాముడు జగదేకవీరుడనీ, రావణుణ్ణి వధించి తమను వుద్ధరించడానికి అంతకంటే అర్హులు ఇక ఎవరూ లేరనీ, ఇప్పుడు ఆ సమయం ఆసన్నమయిందనీ, మును లంతా కొండంత ఆశతో వున్నారు ఎప్పటి నుండో! మఱి, ఇవ్వాళ్ల నేను అతన్ని దును మాడకపోతే, వారి ఆశలు అన్నీ...పైగా నా అసమర్థత వారికి తేటతెల్లమై పోదూ? ఇక ముందు వారి దృష్టిలో నా పరాక్రమం......

అది అలా వుంచి——

లంకలోని గుట్టు తెలిసికొనడానికీ, శత్రువుల రహస్యాల్ని అరయడానికీ ఈ విభీషణుణ్ణి దగ్గరకు దీసి, రావణవధానంతరం లంకకు రాజుగా చేస్తామని అతనికి రాజ్యతృష్ణ గలిగించానుగా! తప్పకుండా లంకారాజ్యం ఇప్పిస్తానని వాగ్దానం జేశానుగా!! మఱి ఇప్పుడు ఏదో విధంగా రావణుణ్ణి సంహారించకపోతే, ఈ వాగ్దానానికి భంగం గలుగదూ? నేను సమర్థుణ్ణి అనీ, విజయాన్ని పొందుతాననీ నమ్మి, అన్నను తిరస్కరించి, నా పక్షానికి వచ్చిన

ఈ విభీషణుడు నన్ను గూర్చి ఏ మనుకుంటాడు, నేను రావణుణ్ణి చంపలేకపోతే? రాముడు వాగ్దానభంగం గావించాడని ముందు ముందు లోకం ఏ మనుకుంటుంది? విభీషణుని దృష్టిలో నేను ఎంత...

అదీ గాక—

నేను ఇతన్ని చంపలేకపోతే అసలు సీత గతి ఏ మవుతుంది? ఈ సైన్యాలు అన్నీ పోగుచేసింది ఆమె కోసం గాదూ! ఈ ఘోరయుద్ధం సాగిస్తున్నది ఆమె కోసం గాదూ? రావణునితో ఈ విరోధం ఆమె కోసం గాదూ?

తన విమోచనకై సీత దినం ఒక యుగంగా గడపడం లేదూ? నేను త్వరలో వచ్చి శతృసంహారం జేసి తన్ను అయోధ్యకు తీసుకు వెళ్ళుతానని ఆమె అహర్నిశమూ ఎదురు చూస్తుండడం లేదూ? ఇప్పుడు రావణ వధోద్యోగం విఫలమైపోతే ఆమె గతి ఏమి కావాలి? ఆమె ఆశలు అన్నీ అంతరించి పోవలసిందే గా! ఇక ఆమె హృదయం శోకతప్తమై, ఆమె జీవితం దుఃఖ భాజనమై చివరకు......అబ్బా? నా దౌర్బల్యానికీ నా శక్తి లేమికీ ఆమె ఏ మనుకుంటుంది?

లంకాధిపతిని తుంచి రాముడు భార్యను అయోధ్యకు గొని పోతాడనీ, ఆమెను చెరబట్టి నందుకు అతనికి తగిన శాస్తి జరుగుతుందనీ ఉత్సహిస్తున్న లోకు లంతా ఇక ముందు నన్ను గురించి ఎంత హేళనగా చెప్పుకుంటారు? నా అసమర్థతను గురించి ఎన్ని విధాల ఆడిపోసుకుంటారు?

అసలు నా యీ జీవితమే చివరకు హాస్యాస్పదమూ, అర్థరహితమూ అయిపోదూ?—

ఇలాంటి పరిస్థితుల్లో—

అన్యాయాచరణమైనా, అక్రమాచరణమైనా, విభీషణుని సూచన అనుసరించి, రావణ వధోద్యోగానికి గడంగాలి. అంతకంటే గత్యంతరం ఏమీ లేదు! లేకపోతే నా ప్రయత్నాలన్నీ వ్యర్థమై పోతాయి.

[ప్రకాశంగా]

నాభిలో అమృతకలశం వున్నదా?... అందువల్లనేనా ఇతడు ఇంతగా విజృంభించడం! అయితే చూడు విభీషణా—

[అని, సంకోచిస్తూ, నిశితనారాచాన్ని ప్రయోగిస్తాడు రావణుని నాభిమీద. భయంకరనాదం చేస్తూ వసుంధరపై పడిపోతాడు రావణుడు తర్వాత కొంతసేపటికి]

రాముడు

విభీషణా! నా భారం తగ్గింది.

విభీషణుడు

[ఉత్సాహంగా]

ఈ లంకారాజ్యం నాదే కదూ ఇక!

రాముడు

ఇంకా అనుమానమా!

[తెర]

# బ్రహ్మహత్యాఫలం

## రంగము —సముద్రతీరము

[దీర్ఘాలోచనామగ్నుడై దేవేంద్రుడు కూర్చుని వుంటాడు. అతనికెదురుగా కొందఱు దేవతలు ఆసీనులై వుంటారు. వారిప్రక్క మఱికొంతమంది మునులు. మనోజ్ఞమైన ఉత్తుంగతరంగ సంఘాలతోటీ, పాఠీనపంక్తులతోటీ, ఫేనరాసులతోటీ పరగుతుంటుంది పారావారం సముద్రావలోకనం జేస్తూ సంతోషిస్తూ వుంటారు మునులు దేవతలు. దీర్ఘవిచారమగ్నుడైవున్న దేవేంద్రునికి మాత్రం ఎట్టఎదుట ఏమీ వున్నట్టే కన్పట్టడంలేదు. మునులు దేవతల్ని జూచి ఇలా అంటారు అప్పుడు:]

మునులు

నిలింపులారా! మేము కని విని ఎఱుగని యుద్ధం జేశాడే వృత్రాసురుడు మొన్న!

దేవతలు

అవును. వాడు అతీతుడు. అజేయుడు కూడాను.

మునులు

కాబట్టే వాడు మన ఇంద్రుణ్ణి కూడా మ్రింగివేశాడు.

దేవతలు

మనం అంతా కష్టపడి, ఈ దేవేంద్రునికీ అతనికీ స్నేహం గలిగించబట్టే నిలువ గలిగాము భూమి మీద. లేకపోతే,ఏ పుట్టలు

గుట్టలు బట్టి పోవలసి వచ్చేదో ఇప్పటికి, ఈ నాకలోకం వదలి పెట్టి.

మునులు

[ఉత్సాహంగా]

శ్రీమన్నారాయణుని ఆజ్ఞానుసారంగా వృత్రాసురునికీ వజ్రాయుధునికీ మిత్రిత్వం నెఱపబట్టే మనం హాయిగా, ఏం భయం లేకుండా ఈ లోకంలో......

దేవతలు

[ఆలోచనగా]

వాడు మమ్మల్ని పెట్టిన బాధలు ఇంకా మఱపునకు రావడం లేదు సుమా!

[ఇంతలో దేవేంద్రుడు తేరిపాఱ జూస్తాడు ప్రక్కనున్న వారిని. ఆశ్చర్యాన్ని అభినయిస్తూ ఇలా అంటాడు.]

దేవేంద్రుడు

ఓహో! మునిపుంగవులారా! మీరు వచ్చి ఎంతసేపయినది? నే నింకా చూడ లేదు మిమ్మల్ని.

మునులు

మీ రేదో దీర్ఘాలోచనామగ్నులై వున్నారు. అందుచేతనే మమ్మల్ని గమనించ లేకపోయినారు.

దేవేంద్రుడు

మీరు మాట్లాడడం వృత్రాసురుణ్ణి గురించేనా?

మునులు

అవును. నిన్న మొన్నటి దాకా అతడు మమ్మల్ని అందర్నీ పెట్టిన బాధలను గురించి చెప్పుకుంటున్నాము.

దేవతలు

ఎలాగో మీ ఇద్దరికీ నెయ్యం జరుగబట్టి, మేము కాస్త ప్రశాంత జీవనం జేస్తూ వుండగలిగాము. లేకపోతే మా అవస్థ.......

దేవేంద్రుడు

[ఆలోచనగా]

మిత్రులారా! మీ రందఱూ నిర్విచారంగానే వుంటున్నారు. అదీ నాకు సంతోషకరంగానే వున్నది. కాని, ఒక విషయం మాత్రం నన్ను పీడిస్తూవున్నది ప్రతిక్షణమూనూ—

మునులు

[ఆతురతగా]

అ దేమిటో మేము......

దేవతలు

[నెమ్మదిగా]

అందుకేనా మీరు దీర్ఘాలోచన......

దేవేంద్రుడు

[దీనంగా]

మొన్న మొన్న జరిగిన యుద్ధంలో నన్ను ఆ వృత్రాసురుడు క్రిందు గిన విషయం మీకు తెలిసిందే గాదూ! తర్వాత మనల అందరినీ పరాజితులుగా జేసింది మీకు జ్ఞాపకమున్నది గాదూ?

దేవతలు

[క్రిందికి చూస్తూ]

ఔc... అవును.....

దేవేంద్రుడు

ఆ ధీరునిధాటికి ఆగలేక, మీ రంతా గలసి మాకు మిత్రత్వం సంఘటింప జేశారు, అంతా నిలకడగాఁవుండడానికి. దీన్ని బట్టి తేలే దేమిటి ఆలోచిస్తే?

మునులు

[ఆలోచనగా]

అతను మన కన్న మిన్న యైన వాడని.

దేవేంద్రుడు

[ఆవేదనగా]

అంతేకాదు. నలుగురిలో మొగ మెత్తికొని తిరగడానికీ, చరించడానికీ నామర్దాగా వున్నది నాకు. విచారిస్తే వీలిపోతున్న ది నా యెడద. అబ్బా? అమరుల నిర్వక్రపరాక్రమం అడుగంటిందా ఆ అసురుని ముందర? నిర్జరనాథుని నిస్తుల తేజం నిద్రబోయిందా ఏమి? దానవునితో మిత్రత్వం జేశాడు అతన్ని జయింపలేక అని లోకులు నవ్వడంలేదూ!! ఒక్క నీచరాక్షసుణ్ణి దునుమాడలేని వానికి ఎందుకు ఈ నాకలోకాధిపత్యం అంటూ, అప్సరసలంతా హసించడం లేదూ!!! ఇంకెందుకూ నాకీ అమరలోకాధిపత్యం, వృత్రుణ్ణి జయింపలేక వానితో నెయ్యం నెఱపిన వాడికి?

మునులు

[దీనంగా]

దేవేంద్రా! ఆ పూర్వగీర్వాణుడు పెట్టే బాధలకు తాళజాలక, ఈ వుద్యోగానికి గడంగాము మేము. అయితే, ఆ దోషం మాదే. క్షమించు.

దేవతలు

మునిపుంగవులారా! మీరు అలా అనుకోవడం పొరపాటు. మేము వానితో జన్యం జరుపలేకపోయినప్పుడు వేరే గత్యంతరం ఏ ముంటుంది? ఏదో విధంగా సంధియో, స్నేహమో చేసుకోవాలి గాని?

మునులు

తాత్కాలిక బాధ నపనయించుకోడానికి అలా చేయవలసి వచ్చింది. దానికి మీరు కూడా మౌనం వహించారు.

దేవేంద్రుడు

మహర్షులారా! మిమ్మల్ని దోషదూషితులుగా చేయడం లేదు. ఇంతకూ, లోకానికి మా అసమర్థత వెల్లడి కావలసి వున్నది కాబట్టి ఇలా జరిగింది. ఎవరిని ఏ మంటే ఏం లాభం వుంటుంది? అంతా మాలోనే......

దేవతలు

[ఆతురతగా]

అధిపా! మళ్లీ మనం ఆ వృత్రుణ్ణి పిల్చి యుద్ధానికి గడంగుదామా!

[దేవేంద్రుడు ఏమీ మాట్లాడకుండా వుంటాడు]

మునులు

యుద్ధం జేయడం అసంభవం. ఒకవేళ చేసినా యథాప్రకారమే అవుతుంది.

దేవతలు

[ఆతురతగా]

అసంభవమా? ఎలా?

మునులు

మన ఇంద్రునికి మిత్రుడు గాబట్టి వృత్రుడు.

దేవేంద్రుడు

నేనూ అదే ఆలోచిస్తున్నాను.

దేవతలు

మునిచంద్రులారా! మీరు అలా అంటే ఎలా? మా ప్రభువును పరాభవానలజ్వాలలు మాడ్చివేయవ్వా, ఏదోవిధంగా మళ్లీ వృత్రుణ్ణి మారణం బొందించకపోతే? మా అమరలోకనివాసుల్ని అందఱూ అపహసించరూ? మేమూ, మాప్రభువూ అపఖ్యాతిపాలయి అడుగంటిపోవడం మీకు మాత్రం...... అతను ఇప్పటికి మిత్రుడే అనుకోనండి. అసలు శాత్రవుడేగా మొన్నటిదాక! అల్లాంటి వానిని, మమ్మల్ని పరాభవించిన వానిని, సంహరింపకుండా వుండడం ఏమి......

మునులు మౌనం వహిస్తారు.]

దేవేంద్రుడు

[రౌద్రంగా]

నిలింపులారా ! ఇక మనం ఆ దానవుణ్ణి దునిమే దాకా నిద్ర బట్టదు నాకు. ప్రతిక్షణమూ పరాభవానల కీలికామాలికలు నన్ను మాడ్చివేస్తున్నాయి. ఈ స్వర్గలోకానికి సార్వభౌముడనని చెప్పుకోడానికి సిగ్గు వేస్తున్నది. ఇక నేను ఒక్క క్షణం గూడా ఈ వృత్రుణ్ణి చంపకుండా....

దేవతలు

సత్వరంగా శాత్రవసంహారానికి గడగవలసిందే ఇక మనం.

దేవేంద్రుడు

[విచారంగా]

పైగా మొన్న మళ్ళీ అతను కొన్నివరాలు పొందాడనుకుంటాను. పగళ్లూ రాత్రిలూ అతనికి చావు లేదు. శుష్కమైన దాని చేత, ఆర్ద్రమైనదాని చేత, శస్త్రాల చేత కూడా అతనికి చావు లేదటే!

దేవతలు

అవును, ఈ వరాలే పొందాడు మొన్న.

దేవేంద్రుడు

మరి, దీనికి మార్గం ఎలా? ఏదో ఒకటి నేను ఆలోచిస్తానులే! మీరు మాత్రం జన్యానికి సన్నద్ధులై సమయం వచ్చినప్పుడు సంకోచింపకుండా శత్రుసంహారం జేయడం అవసరం.

దేవతలు

[వినయంగా]
ప్రభూ! మాకు ఇంకా ఇన్నిసార్లు చెప్పవలెనా?

దేవేంద్రుడు

సరే, ఇక వెళ్ళండి మీరు పొద్దు, గ్రుంక వస్తున్నది..
[మునులను చూస్తూ]
మహర్షులారా! ఇక సెలవు.

[వెంటనే దేవతలూ, మునులూ లేచి వెళ్ళిపోతారు అక్కడనుండి తమతమ నివాసాలకు. ఒక్క దేవేంద్రుడు మాత్రం అక్కడే కూర్చునివుంటాడు, ఏమిటో ఆలోచించుకుంటూనూ. తపనుడు చరమభూధరాగ్రం దరికి పోతూ వుంటాడు. విచారమగ్నుడై ఇంద్రుడు సైకతస్థలం వంక చూస్తూవుంటాడు. ఇంతలో దూరాన పదధ్వని వినిపిస్తుంది అతనికి. తలయెత్తిఎట్టఎదుట కొంచెం దూరంలో ఒక వ్యక్తిని చూస్తాడు. అప్పుడు ఇలా అనుకుంటాడు]

దేవేంద్రుడు

[తనలో]
ఓహో! తలవని తలంపుగా వచ్చాడే వీడు! మిత్రుణ్ణే అను కుంటూ పాపం నా దరికి జేర వస్తున్నాడు మెల్ల మెల్లగాను. వీని వధోద్యోగానికి గడంగేదా?

[ఆలోచించి]

ఛీ! అన్యాయం! పాపం, కష్టపడి దేవతలూ, మునులూ మా యిద్దరికీ మిత్రిత్వం ఘటింప జేశారు. మిత్రభావంతోనే వీడు నన్ను సమీపించడానికి సాహసిస్తున్నాడు. ఇలాంటి వాణ్ణి సంహా రించడానికి ఉపక్రమిస్తే లోకం నన్ను గురించి....

[మళ్ళీ చింతించి]

వీ డేమి మిత్రుడు? మొన్న మొన్నటి దాకా శత్రువేగా!! మమ్మల్ని అందఱినీ ముప్పు తిప్పలు బెట్టిన బెట్టిదుడు వీడేగా! అమరలోకం అంతా అల్లాడిపోయేటట్టు ఆహవభూమిమీద నన్ను మ్రింగివైచింది వీడేగా!! ఇట్టివాణ్ణి కొట్టకుండా మిత్రుడంటూ వదలిపెట్టితే ఎలా? వీణ్ణి వధించడం అంతగా అన్యాయం గాదనుకుంటాను. ఒకవేళ అయినాగాని, పేరు ప్రతిష్ఠలు నిలుపుకోవద్దూ మఱి? వృత్రాసురుణ్ణి జయింపలేక, వజ్రాయుధుడు వానితో మిత్రత్వం జేశాడు అనే వాడుక సమసిపోవద్దూ?

[ఉత్సాహంగా]

ఇది సంధ్యాకాలం. మంచి సమయం గూడాను. ఈ అవకాశాన్ని పోగొట్టుకోకూడదు. అయితే, వీణ్ణి వధించేది ఎలా?

[అటూ ఇటూ చూచి]

ఇవిగో! ఇక్కడ సముద్రఫేనరాసు లున్నాయి. నా కులిశానికి వీటిని కీలిస్తాను.

[వెంటనే కూలం మీదకు కొట్టుకొని వచ్చిన నురుగును దీసి కులిశ ముఖాన కీలిస్తాడు దేవేంద్రుడు. దాన్ని శత్రువు మీద ప్రయోగిస్తాడు. అది వాని తల వ్రక్కలు జేస్తుంది గంభీరధ్వానాలతో వెళ్లి. ధాత్రీతలంమీద వృత్రాసురుడు పడిపోతాడు భీషణ నిర్ఘోషం గావిస్తూనూ. జంభారాతి ముఖాంభోజం మీద తరళదీధితులు తాండవిస్తూ వుంటాయి.]

[తెరలో]

దేవేంద్రా ! దేవేంద్రా! ఎంత పని జేశావు! ఎంత పని జేశావు!! మిత్రుణ్ణి చంపడమా!! ఆఁ......ఎంత సాహసం! ఎంత సాహసం!! నమ్మిన మిత్రుణ్ణి చంపడం! అబ్బా! ఏమి బ్రహ్మహత్య! త్వరలోనే నీవు దీని ఫలం...నీ రాజ్యం అంతా నీ స్వాధీనంలో వుండదు...ఇక నీవు రాజ్యభ్రష్టుడవు. ఈ ఘోరబ్రహ్మహత్యా ఫలం అనుభవింపక తప్పదు. ఇదిగో ఇప్పుడే నీ రాజ్యానికి నీళ్లు వదలవలసి వస్తుంది నీవు! తర్వాత, నీ అవస్థ ఏమో ఎవరి కెఱుక?...

[దేవేంద్రుని ముఖం తెల్లబోతుంది]

[తెర]

## వనవాసము

### రంగము — మహారణ్యము

[దీనాననుడై దిక్కులు పరికిస్తూ నెమ్మదిగా పోనిస్తూ వుంటాడు రథాన్ని లక్ష్మణుడు ఏమీ మాట్లాడకుండాను. అతనికి కొంచెం పైభాగంలో కూర్చుని వుంటుంది సీత. ఆమె వదనాంబుజం వికాస విలాస హాసభాసు రంగా వుంటుంది. దుర్గమారణ్య ప్రదేశాల్లోబడి రథం అలాగే పోతూ వుంటుంది. మార్గమధ్యంలో సీత ఇలా ప్రశ్నిస్తుంది లక్ష్మణుణ్ణి:]

సీత

లక్ష్మణా! మనం ఇప్పుడు అయోధ్యా పట్టణం నుండి ఎంత దూరం వచ్చి వుంటామో ?

లక్ష్మణుడు

అమ్మా! చాలా దూరం వచ్చాము. కొన్ని యోజనాలు అతిక్రమించి వచ్చాము.

సీత

మనం ఇంకా ఎంత దూరం పోవలసి వుంటుంది?

లక్ష్మణుడు

[దీనంగా]

ఎంత దూరం ఏముంది? ఈ గహనతలాల్లో ఎక్కడ వసించాలని

క్రోరిక వుంటుందో అక్కడే వుండవచ్చు నీవు. కాదు. కాదు. మఱచిపోయాను సుమా! మునీశ్వరుల ఆశ్రిమాలు చేరాలి.

సీత

[ఆలోచనగా]

అయితే మునిపుంగవు లుండేది ఎక్కడ?

లక్ష్మణుడు

ఇంకా కొంచెం దూరం బోవాలి. ఇదంతా దుర్గమారణ్యం. కూ్రిరజంతుసంతానాలకు ఉనికిపట్టు.

సీత

అందుకనే ఈ స్థలం సాధ్వసాన్ని ఆపాదిస్తూవున్నది స్వాంతానికి మిక్కుటంగా. అయినా, ప్రికృతి సౌందర్యం అంతా తాండవిస్తున్నది ఇక్కడే. లక్ష్మణా! అటుచూడు! ఆ శార్దూలాలు ఎలా పరుగులిడుతున్నాయో మన రథనేమీ నిర్ఘోషాలు విని తల్లడిల్లిపోయిన గుండెలతో!! అదిగో! ఆ రసాలవృక్షాగ్రినివసిత పరభృత ప్రిచయ మధురకూజితాలు మానసానికి ఎంతశాంతాన్ని సముపార్జిస్తున్నాయి!!

[ఉత్సాహంగా]

పూర్వజన్మంలో ఎంత పుణ్యం జేశానో గదా నేను! లేకపోతే ఇలాంటి రమణీయదృశ్యాల్ని వీక్షించడానికి వీ లవుతుందా? దయామయుడు శ్రీరామచంద్రుడు ! ఆయన అనుగ్రిహం చేత నేగా ఇదంతా లభించడం!! మునిజనవాసాలకు వెళ్ళి వస్తానని

చెప్పగానే 'సరే' నన్నాడు సంకోచింపకుండానూ. తోడిచ్చి నిన్ను పంపుతున్నాడు కూడానూ.

లక్ష్మణుడు

[తనలో]

అసలు విషయం పాపం ఇంకా ఈమెకు అవగతం గాలేదను కుంటాను. ఆ విషయం తెలిస్తే అవిసిపోవూ ఈమె గుండెలు? నిష్కల్మషహృదయం ఈమెది. కల్మషహృదయం నుండి అయింది ఆజ్ఞ. ఆయన అంతరంగం ఈమెకు ఎలా తెలుస్తుంది? పాపం ఎంత సంతోషిస్తున్నది నాధుడు మంచివాడంటూనూ! తుట్టతుదకు అసలు విషయం తెలియజేయవలసింది నేనేగా ఈమెకు? నేను ఎలా ఆ మాటలు ఈమెకు...నా హృదయకాఠిన్యానికి ఈమె ఎంత కుందిపోతుందో గదా అప్పుడు...అబ్బా! ఎలాంటి ఘోర కార్యాచరణానికి వుపక్రమించినాయి నా చేతులు రెండూనూ. ఇంతదూరం ఈనిబిడ విపినసీమలగుండా - ఈ నిస్తంద్రాటవీవాటి కల గుండా - ఈ నానాభీల మృగసంవాసిత కాననావళుల గుండా- ఈ మహాసాధ్వీలలామతో- ఈరథాన్ని ఎలా తోలుకొచ్చాను? ఛీ! అన్యులెవరైనా ఇంత కఠినకార్యోన్ముఖు లవుతారా? లోక మంతా నన్ను ఎంతగా దూరుతుందోగదా!! కఠినాత్ముడనీ, నిర్దయుడనినీ - అన్నగారి ఆజ్ఞ ముందుగా తెలుపలేదేమని ఈ ముదిత నన్ను ఎంతగా తూలనాడుతుందో గదా!! ఎంతటిపనికి పూనుకోనవలసి వచ్చింది!—ఛీ! ఛీ!—నేను ఎంత కర్కశస్వాంతుణ్ణి!...ఏం జేయగలను? అది అన్నగారి ఆజ్ఞ...దాటనలవి గానిది...దుర్వార మైనది.

సీత

ఏం! లక్ష్మణా! సమాధానమే లేదు? మౌనముద్ర వహించా వేమి?

లక్ష్మణుడు

ఏదో ప్రకృతి రామణీయకాన్ని అవలోకిస్తూ ముగ్ధుడనై పోతు న్నాను. అంతేగాని, మౌనం లేదు ఏ మాత్రమూనూ.

సీత

లక్ష్మణా! చూడు! చూడు! ఈ ప్రదేశం ఎంత కమనీయంగా వున్నదో!

లక్ష్మణుడు

రామణీయకం రాజిల్లుతున్నది. కాని అక్కడక్కడ దాని పజ్జనే విడంబించి పోతున్నది మహాభీలమైన దృశ్యమూనూ, అప్పు డప్పుడు.

సీత

నిజంగా, చూస్తే, మన అయోధ్యా పట్టణం కంటే ఇక్కడ చాలా బాగుంటుం దనుకుంటాను కాదూ?

లక్ష్మణుడు

అవును, అలాగే వున్నది.

సీత

ప్రకృతిదేవి తన తరళసౌందర్యాన్ని అంతా ఇలాంటి నిబిడ విపినసీమల్లో వెదజల్లి ఎంత వ్యర్థమై పోతున్నదో చూచావ్రా, జనానుభూతం గాక పోవడంచేత ?

[సంతోషంగా]

అబ్బా! ఈ నదీసలిలం ఎంత సలలితంగా వున్నది. అయోధ్య లోని ధవళసౌధాల్లో నివసించడం కంటే ఈ తరంగిణీ తీరం మీద సంచరిస్తే హృదయసమ్మదంగా వుంటుంది గదూ? విచ్చలవిడిగా విహరిస్తున్న ఈ హరిణశాబకాలు నేత్రోత్సవం జేస్తున్నాయి. ఎలాంటి రమ్యప్రదేశాలను చూడడానికి నోచుకొన్నాను నేను రామచంద్రుని నితాంతానురాగసంభూతాజ్ఞచేత!!

లక్ష్మణుడు

[తనలో]

పాపం ఈమె అమందానందం వర్ణనాతీతం. ఒక్కక్షణంలో ఈమె ఆనందం అంతా అడుగంటి దురంతదుఃఖాగ్నికి ఆహుతియై పోతుంది గాబోలు! అబల. ఇంకనూ ఎంత విశ్వాసము...భర్త గారి హృదయం తెలియదుగా మటి? తన విషయంలో భర్త ఇంత అనుమానం జెందుతాడనే సందేహం కలలోనైనా కాంచ లేదుగా! కాంచదు...అవకాశ మేదీ? మహాపతివ్రతారత్నం గదూ?

[విచారంగా]

అబ్బా! ఎంతరాతిగుండె! అబలను అడవుల పాలుచేసి, తర్వాత...ఎన్ని చెప్పినా—వ్యర్థమేగా!! నేను ఏం జేసేది? అన్నగారి ఆజ్ఞ ధిక్కరింతునా? కూడదు. ఎన్ని అనిర్వచనీయ కష్టపరంపరాహతులకు అగ్గం గావలసి వున్నదో ఈమె ఇక.

[ముందుచూచి]

ఓహో! అన్నగారు చెప్పిన గుర్తులు పొడగట్టుతున్నాయే! అవిగో! ఆ కనుపడేవి మునిపుంగవుల కుటీరాలు. ఇక ఈమెను ఇక్కడే వదలిపెట్టాలి గాబోలు. దైవమా! ఎంత క్రూరకార్యం ఆచరింపవలసి వచ్చింది! ఈ నిష్కల్మషహృదయను ఈపతివ్రతా లలామను—చిట్టచివరకు ఈ భీకరాటవిలో... ఇక రథాన్ని నెమ్మదిగా పోనిచ్చి ఆపాలి. హా! ఎంత ఘోరం! ఎంత ఘోరం!

సీత

లక్ష్మణా! లక్ష్మణా! ఆ దూరాన కన్పడుతున్నవి పర్ణశాలలు లాగా వున్నాయే!

లక్ష్మణుడు

అవును. ఆ వుటజాల్లో ఋషిపుంగవు లుంటారు.

సీత

[సంతోషాతిశయంతో]

ఎంతభాగ్యం! తపోధనాఢ్యుల సందర్శనం! పైగా వారిసేవ కూడ లభించబోతున్నది. ఎంతధన్యురాలను నేను!!

లక్ష్మణుడు

[తనలో]

పాపం! ఏమిా ఈమె సంతసం!

[ప్రకాశంగా]

అవును. వారి యుత్కృష్టసేవాభాగ్యంకూడ లభిస్తుంది మనకు.

సీత

ఇక్కడ వుండే మునిబాలికలతో సఖ్యం జేసికోవాలని ఎన్నాళ్ళ నుండో అనుకుంటున్నాను. ఆ కోరిక ఇవ్వాళగదా తీరబో తున్నది! వారు ఎంతో నిర్మలహృదయులట! అలాంటివారితో కలసి మెలసి వుండడం పోసగుతుందా అందరకూ? అక్కడ ప్రశాంతమైన జీవనం జేయవచ్చును కూడాను.

లక్ష్మణుడు

[పరధ్యానంగా]

నిజంగా పట్టణవాసాల్లోకంటే ప్రశాంతజీవనమే చేయవచ్చు ఈ మునిపల్లెల్లో అశాంతిమూనూ.

[ఇంతలో పోతూ పోతూవున్న రథం ఆగిపోతుంది. లక్ష్మణుడు క్రిందకు దిగుతాడు. అతని కళ్ళ వెంట నీళ్ళు కారుతూ వుంటాయి.]

సీత

[ఆతురతతో]

లక్ష్మణా! ఇదేమి! ఇదేమి!! పోయే అరదాన్ని ఆపివేసి దిగావు? [లక్ష్మణుడు ఏమీ మాట్లాడకుండా వుంటాడు. వెంటనే సీత క్రిందకు దిగి వస్తుంది. అశ్రుధారాసంకలితం అయిన అతని అననాబ్జాన్ని ఆలోకించి అదరిపోతుంది. ఇలా ప్రశ్నిస్తుంది లక్ష్మణుణ్ణి గద్గదస్వరం తోటి:]

సీత

లక్ష్మణా! ఏమిటీ! మాట్లాడవూ? నా హృదయాన్ని కలచివేస్తు న్నది నీ దీనావస్థ. అశ్రుమిళితాలయి వున్నాయే నీ అక్షులు? కారణం ఏమిటో చెప్పవూ ?

లక్ష్మణుడు

[దీనంగా]

ఏమీ లేదు తల్లీ!

సీత

[చీకాకుతో]

అయితే, రథాన్ని ఇక్కడే ఆపివేశావేం, మహర్షుల ఆశ్రమ వాటికల్ని చేరకముందే? నాకు ఏమీ అర్థం గావడంలేదు నీ చర్య. అంతా వింతా, భయాశ్చర్య కారణభూతమూనూ.

లక్ష్మణుడు

నా చర్యలో వింత ఏ మున్న దమ్మా? ఇది రామచంద్రుల వారి ఆజ్ఞ.

సీత

ఏం? ఆ కుటీరాల దాకా వెళ్ల గూడదూ తేరు?

లక్ష్మణుడు

చూపుమేర దూరం లోనేగా అవి వున్నవి. తేరుతో అక్కడికి వెళ్ళితే, మునీశ్వరులు నన్ను వెంటనే రానిస్తారా? ఆలస్యమవుతుంది. మళ్లీ ప్రొద్దు గుంకక పూర్వమే పోలికి బోవాలి.

సీత

సరే అయితే! నేను వెళ్లగల్గుదునులే అక్కడకు. ఒక మాట... అడిగితే చెపుతావు గాదూ?

లక్ష్మణుడు

అడుగు తల్లీ!

సీత

నీ విషాదానికి హేతు వేమిటో చెప్పవూ?

లక్ష్మణుడు

ఏమి చెప్పేది తల్లీ? నీవు వనవాసానికి గురిగావలసి వచ్చింది. అందుకనే నేను విచారం బొందడం.

సీత

[సంభ్రమంతో]

నేనా వనవాసానికి గురి యవడం? ఎందుకు వనవాసం? నాల్గు రోజులు ఈ మునిపల్లెల్లో సంచరించి, తిరిగి అయోధ్యకు వస్తానుగా!

లక్ష్మణుడు

అలా కాదు. నీకు తెలియదు. శాశ్వత వనవాసమే నీకు...

సీత

[ఆతురతతో]

ఏమీ! శాశ్వత వనవాసమా నాకు? ఎవరు అలా విధించింది?

లక్ష్మణుడు

ఎవ రున్నారు?... మా అన్న గారు...

సీత

మీ అన్న గారేనా? నేను చేసిన ద్రోహం ఏ మున్నది?

లక్ష్మణుడు

నీ మీద అనుమానం వుండడం చేత.

సీత

అనుమానమా నా మీద ఇంకాను? ఎందుకని? సర్వ సుప ర్వులూ చూస్తూ వుండగా నా చేత అగ్నిప్రవేశం జేయించి నేను నిష్కల్మషనని అంగీకరింప లేదూ? అఖిల లోకాలూ నా అసమాన పాతివ్రత్యాన్ని అరసి అతి కుతుకాన్ని పొందడం లేదూ? సీతామహాదేవితో సరిపోలు స్త్రీ మహీవలయంలో ఎక్కడా లేదనే పలుకులు అఖిల దిగంత సంతానాల్లో ప్రతి ధ్వనించడం లేదూ!! నిఖిల మానుష్యకమూ నా పాతివ్రత్య మహిమాన్ని వీక్షించి నివ్వెఅగందిపోవడం లేదూ!!! అయోధ్యాపురవాసు లంతా నా ప్రతిభ చూచి ప్రభూతా శ్చర్యమగ్నులై పోతూవుండడం లేదూ!!! ఇలాంటి నా మీద అనుమానం ఆవిర్భవించిందా మళ్ళీ? అబ్బా! ఎంత మాట వినవలసి వచ్చింది? ఏ క్షణం ఎలాంటిదో ఎవరికీ తెలియదు గదా! ఏ నిమిషానికి ఏ విపత్తు వస్తుందో ఎవరికి తెలుస్తుంది?

లక్ష్మణుడు

ఊరడిల్లుము, తల్లీ!

సీత

అసలు విషయం ఏమిటో ఇకనైనా చెప్పు, లక్ష్మణా! రాము నకు నిజంగా నా మీద అనుమానమే!

లక్ష్మణుడు

అన్నగారికి అనుమానం ఏముంటుంది, అన్నీ తెలిసిన వానికి? లోకనిందకు భయపడ్డాడు. పట్టణంలో ఎవడో రజకుడు అన్నా డట 'పధ్నాలు గేళ్ళు లంకలో వున్న సీతను రాముడు గాబట్టి

తీసు కొచ్చా'డని. ఆ విషయం తెలిసిన దగ్గరనుండే మా అన్న గారి మనస్సు అంతా మారిపోయింది. ఎన్ని చెప్పినా వినలేదు. ఎవడో తులువ అన్న మాటలు లెక్క సేయ కూడ దన్నాను నేను. లాభ మేమీ లేకపోయింది. సమయానికి నీవు కూడ అడ వికి వెళ్లి మునిపుంగవుల్ని చూచి వస్తా నన్నావు. తీసికెళ్లి వదలిపెట్టి రమ్మన్నాడు. ఇందుకే నేను ఈ దీనావస్థ...

సీత

అయితే ఇక నాకు వనవాసం స్థిరం అన్న మాటే?

[లక్ష్మణుడు తల వంచుకుంటాడు. సీత నయనాంతర్గత బాష్పబిందుసందో హాలు ధారలై జారుతూ వుంటాయి.]

సీత

హా! దైవమా! ఇక నేను చేసేది ఏమున్నది? మహాపతివ్రతా శిరోమణి—మహాసాధ్వీలలామ——అంటూ అవని అంతా అగ్గిస్తూ వుంటే నన్ను, నా మీద అనుమానమా రామునకు?- ఛీ! నా బ్రతుకు ఎంత హీన మై పోయింది?

అయ్యో! అనవరతమూ అనంతకష్టనిచయాలకే అగ్గమైపోతు న్నానే నేను! ఇం కెక్కడి సుఖం?- పదునాలుగేళ్లు లంకలో పడరాని పాట్లు పడ్డా గదా! మళ్లీ ఇప్పుడు వనవాసమా! అయ్యో, ప్రియభర్తృవిరహిత వనవాసమా! నా జీవిత మెంత వ్యర్థమైపోయింది? విభునిచే పరిత్యక్తతా, విమలపాతివ్రత్యం పెంపొందించే వెలదికి!!——

ఈ విషయం ఇక్కడ వుండే మునులు వింటే నవ్విపోరూ ? వారి ముఖాలు నేను ఎలా చూచేది ? వారిని సమీపించేది ఎలా ?

[ఆలోచించి]

తిరిగి అయోధ్యాపురికి...ఆ:... ఎంత తెలివితక్కువ ఆలోచన చేస్తున్నాను ! వనవాసం విధింపబడిన తర్వాత మళ్లీ రాముని ముఖం... ఇకమార్గ మే మున్నది ? ఈ క్రూరమృగసంవాసిత వనంలో వాసం జేయ వలసినదే ?

లక్ష్మణుడు

తల్లీ! పూరడిల్లుము.

సీత

ఇం కెక్కడి పూరట తండ్రీ! ఇక నీవు వెళ్ళు. నా కర్మ ఇలా కాలింది. ఎవర్ని దూరితే ఏం లాభం! ఇంతకూ నాజీవితం శోకపరంపరాహత మై పోవలసి వున్నది మొదటి నుండీని.

లక్ష్మణుడు

తల్లీ! చింతింపకు. త్వరలోనే నీకు విముక్తి ప్రాప్తిస్తుంది, నీవు మహా పతివ్రతవు కాబట్టి. నా మాట నమ్ము. ఆ పర్ణశాలల్లోకి వెళ్ళు. అయోధ్యకు వెళ్లుతున్నాను నేను ఇక.

[అని లక్ష్మణుడు అక్కడనుండి బయలుదేరి వెళ్లుతూ వుంటాడు రథం తోటి అయోధ్య వైపు. సీత అక్కడే కూలబడి పోతుంది. ఆమె నేత్రనిర్గతాశ్రుధారాప్రవాహం ఆర్ద్రీకరించి వేస్తుంది అవనీతలాన్ని.]

[తెర]

## ఆచార్యవధ

### రంగము - యుద్ధభూమి

[ద్రోణాచార్యుని దోర్బలానికి పాండవబలం పటాపంచలై పరుగు లిడుతూ వుంటుంది. సంగ్రామరంగం సంత్రాసహేతుభూతంగా వుంటుంది, నరకబడ్డ నరుల తోటీ, విరువబడ్డ విస్ఫీతకేతనాల తోటీ, ఖండింపబడ్డ సముత్తుంగమాతంగాల తోటీ, కూల్పబడ్డ ఘోటకాల తోటీ, తుత్తునియలు చేయబడ్డ తుంగశతాంగసంఘాతాల తోటీని. కౌరవబలం పెంపెక్కుతూ వుంటుంది. దోర్దర్పాన్ని ప్రకటిస్తూ ప్రజ్వరిల్లుతూ వుంటాడు ద్రోణాచార్యుడు. రణరంగంలో ఒక మూల కూర్చుని సమాలోచిస్తూ వుంటారు కృష్ణుడు, ధర్మరాజు, అతని తమ్ములూను. ఇంకా మఱికొంతమంది సైనికులు వారి చుట్టూ నిలువబడి వుంటారు. పాండవుల ముఖాబ్జాలు ఇంచుమించుగా వాలిపోయినట్టుగా కన్పిస్తూ వుంటాయి. అప్పుడు కృష్ణుడు ఇలా అంటాడు :]

కృష్ణుడు

ఏమోయి ! అర్జునా ! అదిగో ! అదిగో ! అటు చూడు. మీ బలాలు ఆచార్య వర్యుని ధాటికి ఆగలేక ఎలా పరుగు లిడుతున్నాయో !! అబ్బా ఏమి లావు! ఏమి వీక !! ఏమి పరాక్రమమూ !!! ఆచార్యునిది ?— వృద్ధు డయినా, యుద్ధం ఎంత నిపుణంగా జేస్తున్నాడు, అరివీరుల గుండెలు అవిసిపోయేటట్టు!

అర్జునుడు

నే నైనా అక్కడ వుంటే మన సైన్యాలు అంతగా తల్లడిల్లేవి గావు.

ధర్మరాజు

[విసుగుతో]

అక్కడ వుండకుండా ఇక్కడకు రావడ మేమిటి ? ద్రోణుని దోర్దర్పాన్ని అడపక—

అర్జునుడు

ధర్మజా! యుద్ధం జేయలేక ఇక్కడకు వచ్చా ననుకుంటున్నా వేమి ? కాదు కాదు. బావగా రెందుకో రమ్మని పిలిపించారు. ద్రోణుణ్ణి మార్కొనడానికి మాకు సాహసం లే దనుకున్నా వా?

ధర్మరాజు

ఇంత మాత్రానికే రోషం గల్గితే ఎలా అర్జునా? నెమ్మదిగా చెప్పలేవూ కృష్ణుడు పిలిపించినా డని?

[రణరంగం వంక చూస్తూ]

అయ్యో! అయ్యో! పాండవానీకాలు పరుగు లిడు తున్నట్టు లున్నా యే! ఆఁ... కౌరవబలాలు అత్యుత్సాహంతో ఆహవం జేస్తూన్నాయి. ఇం కే మున్నది? పాండవులకు పరాజయం గలిగే టట్లున్నది ఇవ్వాళే ! ఇ దేమిటి ? మన బలాలు మన వై పునకే వస్తున్నాయి వెనుకకు తగ్గుతూనూ!!

[కృష్ణుని వంక జూస్తూ]

కృష్ణా! కృష్ణా! ఇం కే మున్నది! మాకు—మా పాండవ బలానికి—దిక్కు ఎవ రున్నారు ఇక?

[ఆతురతతో]

కృష్ణా! కృష్ణా! మాట్లాడ వేమి? మా...మా...బలములు మఱలుతూవుంటే ......అక్కడ నాయకులు ఎవరూ లేరే! భీమార్జునులు ఇక్కడే వున్నారు! ఇక సైన్యావళికి దిక్కెవరు అక్కడ?

[దీనంగా]

విప్రవరేణ్యుడు విజృంభించాడు ఇవ్వాళ. లేకపోతే సైన్యం ఇంత హైన్యదశకు వచ్చేది కాదు. కృష్ణా! త్వరగా త్వరగా—భీమార్జునుల్ని ......అటు... అటు... పంపు నా మాట విని...పాండవుల ప్రతిష్ఠ నిలుపు ప్రపంచంలో........ ఆలస్యం ఏ మాత్రం...

కృష్ణుడు

[నిర్లక్ష్యంగా]

అర్జునా! ఆచార్యవర్యుని అవక్రవిక్రమాన్ని గూర్చి నీ వేమంటావు? చూస్తే, అతడు మనకు లొంగేటట్టు లేడు సక్రమ పద్ధతుల తోటి.

అర్జునుడు

అసలు ఆచార్యులు అస్త్రగురువులు గాదూ! వారు అజేయులు.

అసమానులు. భీష్ముని కన్నా. మిన్న అయిన వారు. వారిని జయించడం ఏమో...

భీముడు

అబ్బా! ఎక్కడి ఆచార్యుడు! ఎక్కడి విలువిద్యా నైపుణ్యం!! త్రుటికాలంలో తుత్తునియలు చేస్తున్నాడు రథావళిని! నిమిష కాలంలో దీర్ఘనిద్రాముద్రితుల్నిగా చేస్తున్నాడు నానాభట నికాయాల్ని!! క్షణకాలంలో సంగరక్షోణీతలాన్ని సంక్షోభింప జేస్తున్నాడు!!! మన బలాలు మజులుతూ వున్నాయి. ఇక మనం ఆచార్యులవారికి చే యెత్తి...

ధర్మరాజు

[విచారంగా]

కృష్ణా! నా మొర ఆలకించే టట్లు లేవే! ద్రోణుని యుద్ధవిద్యా విశారదత్వాన్ని ఉగ్గడిస్తూ వూరికే కూర్చున్నా వేమిా, నాకు ఎదురుగానూ? నా- నా సైన్యములు- నా బలములు- వెనుకంజ వేస్తూ వుంటే - నా సైనికసందోహం సంహరింప బడుతుంటే - నీవు భీమార్జునుల తోటి ఇలా ప్రసంగిస్తూ వుండడం ఏమి... స్వపక్షం నమసిపోతుంటే, చూస్తూ వూరుకోవడమేనా? ఏమిటీ ఈ ప్రవర్తన? ఏమిటీ ఈ కాలయాపన?

కృష్ణుడు

ధర్మరాజా? ఇంత పిరికివాడవై పోతున్నా వేమి ఇవ్వాళ? తొందరపడితే ఎలా?

ఆచార్యుని ఆహవనైపుణ్యాన్ని నీ వెఱుగవూ? నిఖిలలో కాల్ని నిర్జింపగల శక్తి వున్నది అతని బాహుయుగళంలో! ఈ అపార సేనాసాగరాన్ని కలచివేసే శక్తి విరాజిల్లుతున్నది అతని బాహుయుగ్మంలో!! అఖిలనృపాలకోటినీ అవలీలగా మారణం బొందించే టంత విస్తారవిభ్రాజిత విక్రాంతి వెల్గుతు న్నది అతని బాహుద్వయంలో!!! అతడు అజేయుడు. అతని ధాటికి ఒక్క మీ సైన్యమే గాదు, సర్వలోకములూ సంచలించి పోవలసిందే! సంత్రాసం పొందవలసిందే!!

ధర్మరాజు

అట్లని ఇక్కడే కూర్చుంటే ఎలా?

కృష్ణుడు

అయితే, ఏమి జేయాలని నీ వుద్దేశ్యం?

ధర్మరాజు

ఆచార్యుని ఎదుర్కోవాలి మన వీరులు.

కృష్ణుడు

నీవు ఇంకా పొరపడుతున్నావు ధర్మజా! ఈ మన భీమార్జు నులు ఆచార్యుని ఏమీ చేయలేరు. వారివల్ల ఏమీ కాదు కూడాను ఈ సందర్భంలో. ఆచార్యుడు అస్త్రశస్త్రాలకు అగ్గ మయ్యే వాడు కాడు. ఇన్ని మాటలు ఎందుకూ? అతని చేతిలో అస్త్రశస్త్రాలున్నంతవఱకూ ఎవ్వరూ ఏమీ చేయలేరు అతన్ని. అతనిచేత అస్త్రములు విడిపించే లాగున చూడాలి. అంతకంటే గత్యంతరం ఏమీ లేదు.

అర్జునుడు

కృష్ణా! అంత పని ఎలా సాధ్య మవుతుంది ?

కృష్ణుడు

అదే ఆలోచిస్తున్నాను.

ధర్మరాజు

కృష్ణా ! నీవు అన్నట్టు ద్రోణుణ్ణి తుంచడం సులభసాధ్యం గాదు. అతడు నిజంగా అజేయుడే ! అమితబలసంపన్నుడే !! అలాంటి వానిని మన బలాలు మార్కొనలేవు.

[ఆలోచనగా]

అయితే నీవు చెప్పిన విధానం నెఱవేరేది ఎట్లా ? అది మహా కష్టతరమైనది. ఇందుకు మార్గం ఏ మున్నది?

కృష్ణుడు

[నెమ్మదిగా]

లేకేమి మార్గం ? ఈ పని నీ వల్లనే నిమేషకాలంలో అయిపో తుంది. అందుకనే అకస్మాత్తుగా ఈ సమాలోచన జరపడం ఈ సమయంలో.

ధర్మరాజు

[ఆశ్చర్యంగా]

ఏమీ! అది నా వల్లనే అవుతుందా ! నా వల్లనే !! ఆచార్యుని అస్త్రసన్యాసానికీ నాకూ సంబంధం ఏ మున్నది ! అస్త్రసన్యాసం జేయించే టంత సామర్థ్యం నా దగ్గర ఏ మున్నదీ?—

కృష్ణుడు

ఆ సామర్థ్యం నీ ఒక్కని దగ్గరే వున్నది. మఱి ఎవ్వరి దగ్గ రనూ లేదు.

ధర్మరాజు

నీవు చెప్పేదాన్ని నేను విశ్వసింపలేను ఏ మాత్రమూనూ. నీవు మాట్లాడేది నా కేమీ అర్థం గావడం లేదు.

కృష్ణుడు

అయితే, చెపుతాను, విను. నేను చెప్పినట్లు చేయడానికి సంసిద్ధు డవై వుండాలి. అలా చేస్తే, అఖిలభారతావనినీ మీరే అను భవించ వచ్చు నిజంగానూ.

[నెమ్మదిగా]

ద్రోణునికి కుమారునిపై వుండే ప్రేమ అనంతం. నీవు ఎలుగెత్తి ద్రోణుడు వినే లాగున అశ్వత్థామ చనిపోయా డని చెప్పావంటే, వెంటనే అతడు అస్త్రవిసర్జనం జేస్తాడు. ఇక తర్వాత అంతా సులభసాధ్యం అయిం దనవచ్చును. నిఖిల కౌరవానీకాన్నీ చంప వచ్చు నీవు అవలలగాను.

ధర్మరాజు

[సంభ్రమంతో]

ఏమీ! ఏమీ! కృష్ణా! నన్ను ఎలాంటి ద్రోహాచరణానికి పురి గొల్పు తున్నావు ? గురుపుత్రుడు చనిపోయాడని వచించేదా గురుని సన్నిధానంలోనే !! అబ్బా! అలాంటి అసత్యం ఎలా ఆడ మంటావు నన్ను ? — నేను మాత్రం... ఇంత ఘోరకార్యా

చరణానికి — వుపక్రమించలేను — వుపక్రమించను కూడాను ఏ మాత్రమూనూ.

కృష్ణుడు

[విసుగుతో]

అబ్బా! నా యత్నం అంతా వ్యర్థం జేస్తున్నావే? ద్రోణుణ్ణి నిర్జించడం — ముఖ్యంగా అతని చేతిలో ఆయుధం వున్నంత కాలమూ — అతికష్టం. అది అసలు అసంభవం. ఇక ఇంత కంటే మార్గం ఏమీ లేదు. నీవు దీనికి ఇలా అంటే... ఇక మీ గతి ఏమి...?

మీ శ్రేయస్సును గోరే గాదూ, ఇలా చెప్పడం నేను! అనవరతమూ మీ ఔన్నత్యాన్ని అభిలషించేవాణ్ణి గావడం చేత గదూ నేను ఇలా మిమ్మల్ని ప్రబోధించడం!! — మీ సత్వర జయార్థమై గాదూ నేను ఈ హితోపదేశం చేయడం !!!. — అలాంటి నా వచనాల్ని ఆవలికి తోసివేస్తే... మీరు — మీ పాండవులు — వెంటనే రూపు మాసి పోరూ, కౌరవపరాక్రమానల కీలికామాలికలచేత ?

ధర్మరాజు

అయితే, అక్రమాచరణానికి, అన్యాయాచరణానికి, ఎలా పూనుకునేది నేను? నేను అలా అంటే లోకులు నన్ను గురించి కలకాలమూ ఏ మనుకుంటారు? ఇది నా ధర్మదీక్షకు ఒక పెద్ద...

కృష్ణుడు

ధర్మరాజా! ఇంకా అనుమానం ఎందుకు? మీకు అతన్ని జయించే శక్తి లేదు. ఇలాగే వూరుకుంటే అతడు మీ ప్రాణాలు దీయక మానడు. కాబట్టి ప్రాణహాని జరుగుతుంది. అలాంటి సంఘటనలు తప్పించుకోడానికి అబద్ధం ఆడ వచ్చు నన్నారు ఆర్యులు. "ఉద్వాహకాలే రతి సంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే విప్రస్యచార్థేప్యనృతం వదేయుః పంచానృతా న్యాహు రపాతకాని" అనే ప్రమాణాన్ని వినలేదూ! కాబట్టి ఇప్పుడు ఒక్క అబద్ధ మాడినా అంతగా బాధ లేదు. నీ శ్రేయస్సూ, నీ అభ్యుదయమూ, నీ ఔన్నత్యమూ అభిలషించ బట్టే నేను ఇంతగా...

ధర్మరాజు

అబ్బా! నాకు ఆ ఔన్నత్యమూ, ఆ రాజ్య సంపదలూ ఏమీ అక్కరలేదు.

కృష్ణుడు

ఏమీ? ఎంత మాట అంటున్నావు? రాజ్యం అక్కర లేకపోతే ఎందుకూ ఈ సంరంభం అంతానూ? ఎందుకూ ఈ సైన్యాలు? ఎందుకూ ఈ పరరాజన్యసమాగమమూ? ఎందుకూ మీరంతా అడవులలో పడరాని పాట్లు పడింది?

ధర్మరాజు

పోనీలే! మళ్లీ అడవి కైనా వెళ్లి... ఈ కృత్రిమ కార్యం మాత్రం నా వల్ల కాదు.

కృష్ణుడు

ఎంత మాట? ధర్మజా! యుద్ధమధ్యంలో అలా చేస్తే, అవనీ తలం నిన్ను గూర్చి ఏ మనుకుంటుంది? మీ భీమార్జునుల పరా క్రమానికి ఎంత పరాభవం సంఘటిల్లుతుంది?

[భీముని వంక చూస్తూ]

భీమా! చూచావా! మీ అన్న గారి ఆశయాలు! మళ్లీ అడవు లట!

భీముడు

ఎలా గయినా త్వరగా ద్రోణమారణోపాయాన్ని ఆచరణ లోనికి తీసుకురావడం ముఖ్యం. అంతేగాని, భీరుల మాదిరిగా యుద్ధం మానివేయడమూ, అడవులకు వెళ్లడమూనా?

కృష్ణుడు

ధర్మజా! ఇంకా ఆలస్యం ఎందుకు? నేను చెప్పినట్లు...

ధర్మరాజు

[తనలో]

అబ్బా! ఎలాంటి సంధిగ్ధావస్థ వచ్చింది? ఆచార్యుడు అస్త్ర గురువు. అన్యాయంగా అస్త్రవిసర్జనం జేయించడమా! అక లంక మయిన ప్రవర్తనకు కళంకాన్ని ఆపాదించుకోవడమా, ఆచంద్రతారార్కము!!

[మళ్ళీ ఆలోచించి]

కళంకం ఏ ముంటుంది భగవంతుని ఆజ్ఞానుసారంగా వర్తించే టప్పుడు? సర్వజనవంద్యుడైన శ్రీకృష్ణుని ఆన తేగా ఇది! దాన్ని

అనుసరిస్తే, దోషం ఏ ముంటుంది? ఏమీ వుండదు నిశ్చయం గానూ.

ఇక అనివార్యవిక్రముడైన ద్రోణుని చేత అస్త్రవిసర్జనం జేయించాలి. సర్వకౌరవ సైన్యసంహాతుల్నీ సంహరించాలి. తర్వాత, అఖిలావనీతలాన్నీ అమందానందంతో ... ఇదిగో! ఇప్పుడే అతనిచేత అస్త్రవిసర్జనం... అదే ప్రథమ కర్తవ్యం...

[తెరలో]

ఆచార్యా! అశ్వత్థామ ఆహవభూమి మీద అసువులు కోల్పోయాడు.

[దూరాన యుద్ధం జేస్తున్న ఆచార్యుడు ఈ మాటలు వింటాడు. ఉల్లం తల్లడిల్లి పోతుంది. వెంటనే అస్త్రవిసర్జన జేస్తాడు. వితతదుఃఖాంబుధిలో మునిగి పోతాడు. ఇంతలో అకస్మాత్తుగా ఒక దీర్ఘఖడ్గం వచ్చి అతని శిరాన్ని శరీరాన్నుండి వేరు చేస్తుంది. అంతటా హాహాకారాలు అగ్గలం అవుతాయి]

[తెర]

## జ రా సం ధ వ ధ

### ౧ రంగము — రాజభవనం

[ఉన్నతాసనం మీద ఉపవసించి వుంటాడు ధర్మరాజు, పరిచారకబృందం పరివేష్టించి వుండగాను.ఒకప్రక్క— భీమార్జున నకుల సహదేవులు. ఇంతలో కృష్ణుడు వస్తాడు అక్కడకు జేవురించిన ముఖాబ్జం తోటి. అతన్ని గాంచి అందరూ అభ్యుత్థానం ఆచరిస్తారు. ఉచితాసనాసీనుణ్ణి గావించిన తరువాత ధర్మరాజు ఇలా అంటాడు కృష్ణుని తోటి:]

ధర్మరాజు

కృష్ణా! మా సంగతి మఱచిపోయా వేమి? ఇన్నాళ్ల దాకా దర్శనమే లేదు. విశేషా లేమి?

కృష్ణుడు

[ఉత్సాహరహితంగా]

ఏమీ లేవు. మీరు పిలిస్తే, రాజసూయార్థమై వచ్చాను.

ధర్మరాజు

అంతా బాగున్నారా?

కృష్ణుడు

బాగానే వున్నారు కాని—

ప్రారంభించారు. కాని నేను ఏం జేయగలను ! వారి ఎదుట నా బలమూ, నా తేజమూ, నా ప్రతాపమూ వమ్మయి పోయి నాయి. విధిని దూశాను. దూషించాను. రోషించాను. కాని... కాని...

చివరకు ఒక యుక్తి పన్నాము. హంసుడు నిహతు డయ్యా డనే వార్త డిభకుని చెవిలో వేశాము.

ధర్మరాజు

అయితే, హంసుడు అసువులు బాసాడా?

కృష్ణుడు

లేదు. మేము అలా అసత్య మాడాము, డిభకుడు చస్తా డేమో అని, సోదరుని మీది ప్రేమ చేత.

ధర్మరాజు

అబ్బా! అన్యాయం! అన్యాయం!

కృష్ణుడు

అన్యాయ మేమిటి? ప్రాణం మీదకు వచ్చి నప్పుడు?

ధర్మరాజు

తర్వాత ఏమి జరిగినది ?

కృష్ణుడు

అనుకున్నట్లుగానే హతు డయ్యాడు డిభకుడు. ఇక ఈ విషయం తెలిసిన తర్వాత, విలపిస్తూ విగతజీవు డయ్యాడు హంసుడు.

భీముడు

మీ అదృష్టం సుమా!

కృష్ణుడు

తర్వాత దానవసైన్యాలు తల్లడిల్లినాయి. జరాసంధుడు జన్యం ఆపివేశాడు. మగధదేశం జేరాడు.

అర్జునుడు

పరిస్థితులు బాగుగా అనుకూలించినాయే!

కృష్ణుడు

[దీనంగా]

అర్జునా! అంతటితో అయిందా? అప్పటినుండీ, ఆ జరాసంధుడు నిత్యమూ మమ్మల్ని అందర్నీ పీడిస్తున్నాడు. నిరాఘాటంగా దండయాత్రలు సాగిస్తున్నాడు. మాకు ఒక్క క్షణం అయినా హాయిగా గడపడానికి వీలు లేకుండా వున్నది.

ఇక చేసేది ఏమున్నది? అంతా పట్టణం వదలి వేశాము. రైవతక పర్వతం మీద దుర్గం నిర్మించుకుని నివసిస్తున్నాము.

ధర్మరాజు

ఎంత కష్టం! ఎంత కష్టం!!

కృష్ణుడు

ధర్మజా! నేను ఒక విషయం జెప్ప వలసి వున్నది. సావధానంగా విను, చెపుతాను.

మీ పాండవ తేజం ప్రపంచంలో బహుళంగా పర్వుతున్నది. మీ పాండవేయు లంటే, భూమీశు లంతా భూరిసాధ్వస సంకలిత చిత్తులై పోతున్నారు. మీ భీమార్జునుల ధాటికి భూమి అంతా వెఱగంద వలసిందే! కాబట్టి అలాంటి మీ వలన కానటువంటి పని యేమీ వుండదు.

జరాసంధుడు అతీతు డని ఇదివఱకే చెప్పాను గదా! రాజలోకానికి కంటకతుల్యుడై వున్నాడు వాడు. నిర్దయుడై నృపాల నివహాన్ని నిర్జించాడు—నిర్జించడమే కాదు. నిర్భయంగా వారిని అందరినీ కారాగారాల్లో పెట్టి కష్టాలకు అగ్గం గావిస్తున్నాడు, ఆ క్రూరుడు! నిఖిల మానుష్యకానికీ ప్రతి నిమేషమూ అత్యంత భయావహుడై వుంటున్నాడు, ఆ దుర్మార్గుడు!! లోక మంతా వంత జెందుతున్నది అతని క్రూరకార్యవారం కతంగా. లోకం అంతా ఎదురుచూస్తున్నది అతన్ని నిర్జించే యోధుడు ఎక్కడున్నాడో అని! ఒక ప్రజ లేమిటి - ముని లేమిటి - రాజవ్రాతం ఏమిటి—అందఱూ ఆ దారుణ దానవ మారణం ఎప్పుడు సంభవిస్తుందా అని చూస్తున్నారు. అలాంటి వానిని మీరు నిర్మూలించి రాజసూయం జేస్తే, మీ ప్రతిభ...

ధర్మజా! జరాసంధునితో సమరం జేయడానికి ఒక్క భీమబలుడైన మీ భీముడే తప్ప, మఱి అన్యులు ఎవరూ లేరు. భీముడు అవలీలగా అతన్ని ఆహవరంగంలో నిర్జిస్తాడు. అంతే గాదు. సునాయాసంగా అతన్ని సృక్కడంచుతాడు. కాబట్టి నిన్ను కోరేది—

ధర్మరాజు

[ఆలోచనగా]

కృష్ణా! ఎందుకూ ఈ ప్రసంగం అంతానూ? జరాసంధుని యశశ్చంద్రికాసంతానాలు కకుబంతసంతనాల మీద విద్యోతమానాలై వెల్గొందుతూ వున్నాయే! అతని యశాన్నీ, సాధుత్వాన్నీ, సద్గుణగణాన్నీ అంతా కీర్తిస్తుంటే వింటున్నానే! అతడు ఎవరిక ఎప్పుడూ ఎగ్గు చేసినట్లు లేదే!

అయితే, శాత్రవసంచయాన్ని నిజదోర్బలం చేత నిర్జించడంలో ప్రమాద మే మున్నది? అది ప్రతి క్షత్రియ శ్రేష్ఠునికీ అచరణీయ మయినదేగా! అంత మాత్రాన అతని మీదికి వెళ్లడం...

అసలు మాకూ అతనికీ లేనిపోని విరోధాన్ని ఆపాదించబోతున్నావే? అక్రమంగా మేము అతని మీదికి వెళ్లితే అవనీతల సంవాసిత మానుష్యకం మమ్మల్ని గురించి ఏ మనుకుంటుంది? ఏమో! అన్యాయమూ! అక్రమమూ!! దోషదూషితులం అవుతాము.

కృష్ణుడు

అన్యాయం ఏ మున్నది? అక్రమం ఏమున్నది ఇందులో? అతన్ని నిర్జించాలే గాని—సర్వజనులూ సంతసింపరూ! అఖిల భువనాలూ మీ అనిలకుమారుణ్ణి అగ్గలంగా అగ్గించవూ? మీ యశమూ, మీ ప్రతిష్ఠా అఖిల దిగంతసంతానాల్లో తాండవించవూ? సర్వజన — కాదు — సర్వరాజన్య పూజ్యులు

గారూ మీరు ? అతన్ని నిర్జించితేనే మీ రాజసూయం పరి సమాప్తి అయ్యేది. అది పరిసమాప్తి అయితేనే మీ ప్రతిభ ప్రపంచ మంతటా పర్వేది. అది పరిసమాప్తి గావడానికి పూర్వం తేజోవిరాజితు డయిన జరాసంధుని ... అదే ప్రథమ కర్తవ్యం. దాన్ని విడనాడితే మీ తలపెట్టిన కార్యం తల్లక్రిం దయిపోతుంది. కాబట్టి బాగుగా ఆలోచించి...

ధర్మరాజు

అసలు ఆ జరాసంధుడు దుర్వారదోర్బల మండితుడనిన్నీ — భుజాదర్ప విస్ఫీతుడనిన్నీ చెపుతున్నావు. మీ యాదవసంఘం అంతా సంక్షోభించి పోయిందన్నావు అతని సన్నిధానంలో. అలాంటి వానిని మన భీముడు మార్కొనడం...

కృష్ణుడు

ఆ విషయంలో నీకు అనుమానం ఎందుకు? ప్రక్కన మేము లేమూ ?

ధర్మరాజు

[తనలో]

జరాసంధ వధోద్యోగానికి గడంగడం అన్యాయమూ, అక్రమమూ— అంతేకాదు, సర్వజన గర్హితము కూడానూ. అట్లని అందుకు ఉపక్రమించకపోతే ఎలా? ఈ కృష్ణుని మాటలు పెడచెవిని బెట్టితే, పరిస్థితులు ఎలా విషమిస్తాయో! ఇతని మనస్సు నొప్పింప జేస్తే, ముందు మా ప్రతిష్ఠకు ఏం భంగం వాటిల్లుతుందో? అదీ గాక, రాజసూయాఖ్య మహాధ్వరం

పూర్తి జేయాలి. కాబట్టి కోరిన ప్రకారమే చేయాలి లేక పోతే...

భగవానుని ప్రోత్సాహం వున్నది కాబట్టి—భగవానుడే ప్రక్క వుంటాడు కాబట్టి— భీముని విజయానికి ఏమీ సందేహం వుండదు. ఇక భీముణ్ణి పంపిస్తేనే...

[ప్రకాశముగా]

కృష్ణా! నీ మాటకు ఇంకా ఆటంకం ఏ ముంటుంది? భీమార్జునుల్ని తీసుకెళ్లి, సత్వరంగా జయలక్ష్మీ సమాలంకృతుడవయి రా.

[భీముని వంక చూస్తూ]

భీమా! ఏఁ మంటావు?

భీముడు

శ్రీకృష్ణుడు దగ్గరవుంటే, ఇంకా కాని దే ముంటుంది? అతన్ని దునుమాడడం ఎంత పని?

కృష్ణుడు

ధర్మజా ! సంతసం. ఇక భీమార్జునులతో గిరివ్రజం వెళ్ళుతున్నాను.

ధర్మరాజు

మంచిది.

[తెర]

## ౨ రంగము — నదీ తీరము

[మధ్యాహ్నం మూడుగంట లవుతుంది. భయదసాంద్రారణ్య మధ్య నదీ కూలం మీద కృష్ణ భీ మార్జునులు కూర్చుని వుంటారు. ప్రయాణ బడలిక వలన, అంతా ఆయాసం దీర్చుకుంటూ వుంటారు. నికట నికుంజపుంజాల్లో నినాదం జేస్తూ వుంటాయి శకుంత సంతానాలు. అప్పుడు భీముడు ఇలా అంటాడు:]

భీముడు

[ఉత్సాహరహితంగా]

కృష్ణా! ఎంత దూరం వచ్చాము! ఎన్ని అడవులు అతిక్రమించి వచ్చాము! అబ్బా! ఎక్కడి గిరివ్రజమూ! ఎక్కడి హస్తినాపురమూ! ఇంకా ఎంత దూరం......

కృష్ణుడు

ఇంకేమున్నది? దాదాపు దగ్గరకే వచ్చాము. ఇంకో మూడు గంటల ప్రయాణం మాత్రమే!

భీముడు

పొద్దు కుంకక పూర్వమే వెళ్ల గల్గుదుమా?

కృష్ణుడు

వెంటనే ఇక్కడ్నుండి. బయలుదేరితే.

అర్జునుడు

కృష్ణా! ఇంకా ఆలస్యం ఎందుకు? కార్యభారం చాలా వున్నది. పొద్దు గుంకితే పోలు జేరడం గూడా దుర్ఘటం అవుతుంది.

కృష్ణుడు

భీమా! లే! వెళ్లుదాము.

భీముడు

అబ్బా! అప్పుడే!

కృష్ణుడు

ఏం! అలా అంటున్నావు?

భీముడు

ఏ మున్నది? మార్గాయాసం. ఇంకా కొంచెంసేపు వుండి—

కృష్ణుడు

అయితే ఎలా? పొద్దు కుంకదూ! పట్టణం చీకటి పడకముందే చేరితే, ప్రయత్నం ఫలిస్తుంది. లేకపోతే, అనుకున్న దంతా వ్యర్థ మయిపోతుంది.

భీమా! ఇంత నిరుత్సాహంగా వున్నా వేమి ఇవ్వాళ? శాత్రవ మారణం సాధ్యం గా దనుకున్నావా? జరాసంధుని బలపరాక్రమాలు ఏ మైనా నిన్ను భీతిల్ల జేస్తున్నా యేం, చెప్పవూ?

భీముడు

[కోపంగా]

ఎంత మాట! ఆ జరాసంధునికి నేనా భయపడేది? మార్గాయాసం వల్ల అలా కనపడు తున్నాగాని...

శాత్రివమారణం ఎంతలోని పని? అతని బలపరాక్రమాలు, తేజోవిశేషాలూ, వికాంతివిస్ఫూర్తులూ — అన్నీ వృథా అయిపోవలసిందే నాముందర. కాని ఒక సందేహం.

కృష్ణుడు

ఏ మది?

భీముడు

మనం ముగ్గురమూ ఇలా వెళ్లితే, ఎలా? జరాసంధుని సేనలు మనపైకి రావూ?

కృష్ణుడు

అవును. ఈ విషయం ఇదివఱకే ఆలోచించానులే.

భీముడు

నీకు తెలియనిదేమున్నది? అయితే, ఏమి జేయ దలచు కున్నావు?

కృష్ణుడు

మనం స్నాతకబ్రాహ్మణ వేషధారణం జేసి పురప్రవేశం గావిస్తే, ఆ ఆపద తొలగి పోతుంది.

భీముడు

అలా అయితే, ఎవరూ మనలను ఆటంక పరచరా? అతని రాజ్యంలో బ్రాహ్మణులకు బాహాటంగా రాక పోక లున్నా యన్న మాట.

కృష్ణుడు

అవును. ఆ జరాసంధుడు బ్రాహ్మణభక్తుడు. వారిని అత్యంత భక్తితో పూజిస్తూ వుంటాడు. ఏ వేళ వచ్చినా, వారికి అర్ఘ్య పాద్యాదు లిచ్చి ఆదరిస్తూ వుంటాడు. భూమీసురులకు భూరి గౌరవం జరుగు తూంటుంది అతని రాజ్యంలో.

భీముడు

[ఆశ్చర్యంగా]

ఎంత భక్తిపరుడూ! ఎంత పుణ్యబుద్ధీ!!

కృష్ణుడు

భక్తియా! పుణ్యమా! పొరపడుతున్నావే నీవు కూడా! అతడు చేసే ఘోరకార్యాలు అప్పుడే నీ స్మృతిపథాన్ని దాటిపోయి నాయేం?

భీముడు

లేదు. లేదు. ఆ దుర్మార్గాలను మఱచిపో గలనా నేను! అతని అవనీసురాదరణ మాత్రం నాకు అక్కజాన్ని ఆపాదిస్తున్నది.

కృష్ణుడు

మనం కూడా ఆ వేషాల్నే ధరించి, అక్కడికి వెళ్లితే, అగ్గలంగా ఆదరణ జరుగుతుంది. అతడు మనలను మనస్పూర్తిగా ఆహ్వానిస్తాడు.

భీముడు

విప్రు లనే వుద్దేశ్యంతోనే గదూ!

కృష్ణుడు

అవును. ఆ వుద్దేశ్యం తోనే.

భీముడు

తరువాత?

కృష్ణుడు

వధోద్యోగమే.

భీముడు

[ఆలోచనగా]

అబ్బా! అంత పనియా? అక్రమంగా వుండదూ అలా చేయడం— పైగా మోసమూ, కపటమూ...

కృష్ణుడు

అది తరువాత సంగతి. లే! వెళ్లుదాం. భాస్కరుడు ప్రభాహీనుడవుతున్నాడు. అర్జునా! రా!

[తెర]

## జ రా స ం ధ వ ధ

### 3 రంగము — గిరివ్రజము

[రాత్రి సమయం. పది గంట లవుతుంది. పట్టణం చాలవఱకు ప్రశాంతం గానే వుంటుంది. ప్రభుసంభావితావనీసురులు నిర్గమిస్తూ వస్తున్నారు అప్పు డప్పుడు. ప్రచ్ఛన్న వేషాలతో కృష్ణభీమార్జునులు రాజభవనం వైపుకు వెళ్లుతూవుంటారు. అప్పుడు అర్జునుడు ఇలా అంటాడు:—

అర్జునుడు

[ఆశ్చర్యంగా]

కృష్ణా! అతనికి ఎంత భక్తి మహీసురుల మీాద? ఎంతటి సమాదరణ!! వీరంతా సంతోషసంభరిత స్వాంతులై వెళ్ళుతున్నారు, చూడూ! ఇందుచేతనే ఇతని పురం ఇలా సుభిక్షంగా శోభిల్లుతున్నది? ఇలాంటి మహనీయుణ్ణి పొరిగొనడానికి వుపక్రమిస్తే...

కృష్ణుడు

ఏం అర్జునా! వరుసగా ఒక్కొక్కరే... అతని వధోద్యోగం అక్రమ మనేనా?

అతడు చేసే అక్రమచర్యలూ, ఘోరకృత్యాలూ అన్నీ మఱచి పోయినావా, అతని భూసురభక్తి చూచి? అంతమాత్రానికే

అతన్ని దండించకుండా వదలిపెట్టితే ఎలా? లోకాలు అన్నీ అలమటించి పోవడం లేదూ?

[కొంత సేపటికి ముగ్గురూ జరాసంధుని పూజామందిరం జేరుతారు. పూజా నిమగ్నుడయి వున్న జరాసంధుడు, ఆ కృతక స్నాతకుల్ని వీక్షించగానే, వారిని సమీపించి ఇలా అంటాడు]

జరాసంధుడు

[సమ్రితగా]

విప్రిగ్రేసరులారా! వందనములు. లోనికి రండు.

కృష్ణుడు

రాజేంద్రా! విజయ సిద్ధిరస్తు.

జరాసంధుడు

అర్ధరాత్రి వేళ అరుదెంచారేం మహాత్ములారా?

కృష్ణుడు

మీ సమాదరణాన్ని గూర్చి చాలా దూరాన విన్నాము. మీ సందర్శనలాలసుల మయి వచ్చాము. మార్గమధ్యంలోనే ప్రొద్దు బోయింది. పాపం మీరు శ్రిమ అనుకోకుండా అర్ధ రాత్రి సమయాన గూడా మమ్మల్ని ఆదరిస్తున్నారు!

జరాసంధుడు

ఇంత మాత్రానికే శ్రిమా! లేదు. లేదు. మీ బోటి వారిని ఆహ్వానించడంలో ఆవంతయినా శ్రిమ వుండదు నాకు. ఈ కార్యం ఆచరించడంలో నేను పొందే అమందానందాన్ని ఎవరూ పొంద లేరు ప్రపంచంలో.

ఇదిగో! అర్ఘ్యాన్ని స్వీకరించండి. బడలిక నపనయించుకోనండి.

కృష్ణుడు

మాకు అక్కర లేదు.

జరాసంధుడు

[ఆతురతతో]

ఏమీ! గ్రహించరూ? కారణం?

కృష్ణుడు

మేము నీ అతిధులం గాము. నీ శాత్రివులం. నిన్ను మారణం బొందించడానికే మేము వచ్చాము.

జరాసంధుడు

[నిర్ఘాంతపోతూ]

ఏమీ! ఏమీ! మీరు శాత్రివులా? శాత్రివులా? విప్రిలు గారూ? నా అతిధులు గారూ? నా అతిధులు...

నేను మీకు ఏమి అపరాధం జేశాను, నన్ను మారణం బొందించడానికి?

కృష్ణుడు

నీవు చేసిన కూరిరకార్యాలకు అంతు వున్నదా?

జరాసంధుడు

నేనా... నేను— కూరిరకార్యాలా...

కృష్ణుడు

అవును నీవే!... ఎవరో కాదు. నీవే... లోకం అంతా క్షోభించి పోతున్నది నీ మూలంగా.

జరాసంధుడు

[ఆశ్చర్యముతో]

లోకం అంతా నా వల్ల క్షోభించి పోతున్నదా? ఏమి........ సదా సదమలభక్తితో సద్విప్రనికాయాన్ని పూజిస్తూ వుంటాను నేను! సంతతమూ పూజ్యుల్ని భూరిసౌఖ్యాంబుధి వీచికలపై తేలియాడిస్తూ వుంటాను నేను!! ప్రజానురంజకంగా పరిపాలన గావిస్తూ వుంటాను నేను!!! అలాంటి నా వల్ల లోకానికి ఏమి ముప్పు...

కృష్ణుడు

[కోపంగా]

కాదు. కాదు. నీవు నృపాలలోకాన్ని నిర్వీర్యగందించావు. వారిని హింసించావు. కన్నూ మిన్నూ గానకుండా, తోడి రాజపుంగవుల్ని కారాగారాల్లో బంధించావు. ఇవన్నీ ఏమిటీ? క్రూరకార్యాలుగావూ? నిఖిలరాజ్యాలూ నిరంతరమూ అలమటించి పోవడంలేదూ?

జరాసంధుడు

ఓహో! రాజుల్ని దునిమితే దోషం ఏ మున్నది? అయితే, అది క్షత్రియ ధర్మమేగా! భుజదర్పాన్ని ప్రకటించి, యుద్ధ భూమిలో వారిని బంధించడం న్యాయం గాదూ? అన్యాయమా? అన్యాయమా??

కృష్ణుడు

జరాసంధా! మేము నిన్ను పోరిగొనడానికే వచ్చాము. నేను కృష్ణుణ్ణి. వీరు భీమార్జునులు.

[భీమార్జునుల వంక చూస్తూ]
భీమా! అర్జునా! ఇంకా చూస్తా రెందుకు? ఇతన్ని......

భీముడు

[సంధిగ్ధంగా]
ఇతడు నిరాయుధుడుగా వున్నాడే! అల్లాంటి వాణ్ణి మార్కొన డం.........

అర్జునుడు

[అనుమానంగా]
ఇతని చెంత ఆయుధాలు ఏమీ లేనప్పుడు మనం......

కృష్ణుడు

[కోపంగా]
అదు గడుకొక్క మీ అనుమానాలు అధిక మవుతున్నవి. ఇతన్ని చంపడానికి ఇంత కంటే మంచి సమయం ఇంకా దొరుకు తుందా? నిరాయుధు డంటూ, నిస్సహాయు డంటూ కాల యాపన చేస్తే, అంతా వ్యర్థమై పోతుంది. ఇక ఒక్క క్షణ మైనా మీరు ఆలస్యం జేయకుండా ఇతన్ని అంత మొందిం చాలి.

జరాసంధుడు

[నిర్ఘాంతపోతూ—తనలో]
కృష్ణా? ఎంత పని జేశావు? ఎంత కుట్ర పన్నావు? ఎంత పన్నా గమూ! అంతా మించి పోయిందే?

[చుట్టూ చూచి]

అయ్యో! ఈ గదిలో ఎక్కడా ఆయుధాలు లేవే! వీరు ముగ్గురూ నన్ను మార్కొనడానికి సంసిద్ధు లవుతున్నారే! నేను ఒక్కణ్ణే నిరాయుధు ణ్ణయి వీరిని తాకడం ఎలా! నా చేతికి ఎవరైనా ఆయుధాలు అందిస్తే...

[తలుపుల వంక చూచి]

ఏమీ! వీరి మాయోపాయం! నేను ఇంతవరకూ గమనించలేదు సుమా! ఇతరులు ఎవరూ నాకు సాయం రాకుండా వీరు పూజా మందిరం తలుపులు కూడా బంధించి వేశారే! నాకు ఇప్పుడు ఒక్క ఆయుధమైనా అందించడానికి ఎవరూ రావడానికి వీలే లేదే!

[తల పంకించి]

ఏమీ! కాల వైపరీత్యం? వీరు ఎంత పన్నుగడ పన్నినారు? నా స్థితి నాకే......అయ్యో!

నిఖిల రాజలోకాన్ని నిమేషకాలంలో నిర్జించిన నన్ను, సకల శాత్రవసంచయాన్ని సమరాంగణంలో సంక్షోభింప జేసిన నన్ను, వివిధ ధారుణీపాలక సమ్మానితుడ నైన నన్ను......నన్ను... నా రాజ్యంలో, నా పట్టణంలో, నా స్వగృహంలో బంధించి వేశారే! నా స్వస్థానంలో నాకు సహాయం జేయడానికి ఎవరూ రావడానికి వీలు లేకుండా చేశారే! ఏమీ! వీరి కుతంత్రమూ! కపటమూ!

[ఆలోచించి]

గొంతెత్తి ఎవరి నయినా పిలుతునా? ఎలుగెత్తి ఎవరి నయినా ఆయుధాలు తెమ్మందునా?

ఛీ! ఎలాంటి ఆలోచన చేస్తున్నాను? నేను అలా పిలిస్తే, జరాసంధుడు భయభ్రాంతు డైనా డని వీరు గేలి సేయరూ? జరాసంధుడు వట్టి భీరు డని వీరు లోకానికి చాటరూ?

పోనీ, ఆయుధాలు పొందడానికి వీరి ఆజ్ఞ అయినా......

ఆఁ...ఎంతటి తెలివి తక్కువ ఆలోచన! నా పౌరుషం అంతా పాడు జేసి వీరిని ప్రార్థించేదా? నా మానాభిమానాలు మంట గలిపి, వీరి ఆజ్ఞ గోరేదా?

ఈ విధంగా కోరడం నా కీర్తికీ, నా ప్రతిష్ఠకూ, నా ఔన్నత్యానికీ ఎంత కళంకం? నా బోటి ధీరుడు ఈ తుచ్ఛ శత్రువుల్ని వేడడం ఎంత హేయ మైన పని? నేను ఆ విధంగా ప్రార్థిస్తే, వీరి దృష్టిలో నా పరాక్రమానికీ, నా బలానికీ, నా గొప్పదనానికీ ఎంత చిన్నతనం గలుగుతుంది?

నేను సాయుధుణ్ణి అయి పోరడం వీరికి ఇష్ట మయితే ముందే చెప్పే వాళ్లుగా! నేను నిరాయుధుణ్ణి అని భీమార్జునులు ఇద్దరూ శంకిస్తున్నప్పుడు, కృష్ణుడు ఒకప్రక్క ప్రోత్సహించడం విన్న తరువాత గూడా నేను ఇంకా ఇలాంటి ఆలోచనలు చేయడం దేనికి?

ధర్మయుద్ధ సూత్రాల్ని ఉల్లంఘించి, వీరు కేవలం అన్యా

ఇంకా ఇలాంటి ఆలోచనలకు తావు ఏముంటుంది? ఆద్యంతమూ అక్రమ విధానాన్నే అనుసరిస్తున్న వీరిముందు ఇంత మాత్రం అవకాశం కూడానా ?

అర్ధరాత్రి. పూజామందిరం. ఎవరూ రావడానికి సాహసించరు నా ఆజ్ఞానుసారంగా. నిరాయుధుణ్ణి. శత్రువులు ముగ్గురూ అధర్మంగా మీదకు దూక బోతున్నారు. విజయం అనుమానం. అయినా ఆహవానికి వెనుదీయడం వీరలక్షణం గాదు. శక్తి వున్నంతవరకూ...

[అని ఆలోచిస్తూండగా కృష్ణభీమార్జునులు ముగ్గురూ అకస్మాత్తుగా ఒక్క మారే అతని మీద బడతారు. నిరాయుధు డయినా, అద్భుత విక్రమాన్ని నెరపుతూ జరాసంధుడు ముష్టియుద్ధం జేస్తాడు. కొంతసేపటికి అతని బలం సన్నగిల్లిపోతుంది. శక్తిహీను డయి పోతాడు. కృష్ణార్జునులు ఇరుప్రక్కలా పట్టుకుంటూరు. ఇది కనిపెట్టి భీముడు పిలుకుమారుస్తాడు అతన్ని సంకోచం లేకుండానూ. చేష్టారహితమైన అతని శరీరం మాత్రం అవనీతలాన మిగిలి వుంటుంది.]




[తెర]

